# చైర్మన్‌తో ముఖాముఖి



నూకారపు సూర్యప్రకాశరావు
చైర్మన్, సూర్య తెలుగు దిన పత్రిక

**తెలంగాణలో రిజర్వేషన్ల విషయంలో పెద్ద గందరగోళం నెలకొన్నట్లున్నది. ముస్లింలకు 12 శాతం రిజర్వేషన్ల ఇవ్వనున్నట్లు ముఖ్యమంత్రి కేసిఆర్ అసెంబ్లీలో ప్రకటన చేశారు. ఇదెంతవరకు సమంజసం. దీనివల్ల బిసి రిజర్వేషన్‌లలో కోత ఏర్పడే అవకాశాలున్నాయా... బిసిలకు నష్టం జరుగుతుంది కదా...**

**-శ్రావణి, రాజమండ్రి**

ముస్లింలకు 12 శాతం రిజర్వేషన్లు కల్పిస్తానని ముఖ్యమంత్రి కేసిఆర్ ప్రకటించారు. కానీ రాజ్యాంగ పరంగా అవి సాధ్యమయ్యే అవకాశాలు తక్కువనే చెప్పాలి. మతపరమైన రిజర్వేషన్లు ఇవ్వకూడదని అత్యున్నత న్యాయస్థానం సుప్రీంకోర్టు తేల్చి చెప్పింది. గతంలో రాజశేఖరరెడ్డి ముఖ్యమంత్రి గా ఉండగా చేసిన రిజర్వేషన్లు కూడా చెల్లకుండా పోయాయి. చివరకు రాష్ట్రప్రభుత్వ పరిధిలో అధికారాలను ఉపయోగించి మొత్తం రిజర్వేషన్ల యాభైశాతం దాటకుండా ఉండే విధంగా 4 శాతం రిజర్వేషన్లు కల్పించారు. ముస్లింలలోకూడా వెనుకబడిన వర్గాలకే రిజర్వేషన్లు వర్తించేలా ఆయన బిసి ఈ ని ఏర్పాటు చేసి షేక్ కులస్థులకు మాత్రమే రిజర్వేషన్లు కల్పించారు. బిసిల రిజర్వేషన్లు ఖరారైనపుడే దూదేకుల (లద్దాఫ్) కులస్థులకు బిసిలతో పాటు రిజర్వేషన్లు కొనసాగుతున్నాయి. ప్రస్తుత పరిస్థితుల్లో ముస్లింలకు 12 శాతం రిజర్వేషన్లు కేటాయించడం రాష్ట్ర ప్రభుత్వ పరిధిలో లేని అంశం. తన చేతిలో లేని అంశాన్ని ముఖ్యమంత్రి ప్రకటిస్తున్నారు.

**తమిళనాడులో జల్లికట్టు వేడుక అంశం లో కేంద్రం తీరు సరైనదేనంటారా**

**-శ్రీధర్ కాంట, మహబూబ్‌నగర్**

అనాదిగా వస్తున్న ఆచారం. భారతదేశంలో ఆచారాలకు కొదువలేదు. ప్రజల విశ్వాసాలను పరిగణనలోకి తీసుకునే ప్రభుత్వాలు పనిచెయ్యాలి. కానీ ఇక్కడ అంశం కేంద్ర ప్రభుత్వ పరిధిలో లేనిది. ఇది తమిళనాడు రాష్ట్రానికి సంబంధించినది. ఆ రాష్ట్ర ప్రభుత్వమే పరిష్కరించుకోవాల్సిన సమస్య. కానీ ఇందులో సుప్రీంకోర్టు ఉత్తర్వులు ఉండటం, జల్లికట్టును కోర్టు నిషేధించడంవల్ల ప్రభుత్వాలు జోక్యం చేసుకునేందుకు వెనుకాముందాడుతున్నాయి. సుప్రీం ఆదేశాన్ని అమలు చేయాల్సిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వం పైనే ఉంది. సుప్రీం ఉత్తర్వుల రాష్ట్ర ప్రభుత్వం రివ్యూ పిటిషన్ వేసి తిరిగి తీర్పు కోరాల్సి ఉంటుంది. లేదా పార్లమెంట్‌ను సమావేశ పరిచి దీనిపై చర్చించి ప్రత్యేక చట్టం ద్వారా ఈ జల్లికట్టు సాంప్రదాయాన్ని కొనసాగించవచ్చు. అయితే సుప్రీంకోర్టు అంశమైనందున ప్రభుత్వాలు ఆచితూచి అడుగులు వేస్తున్నాయి. తమిళనాడులో ప్రజాగ్రహం రోజు రోజుకు పెరిగి పోతుండటంతో అక్కడి ప్రభుత్వం తలపట్టుకోవడమే కాకుండా కేంద్రం పై కూడా రేద్దేందుకు ప్రయత్నిస్తున్నది.

**అమెరికాలో హిందువులైనా అధ్యక్షుడు కావచ్చని బరాక్ ఒబామా ప్రకటించారు. దీనిపై మీ స్పందన తెలపండి.**

అమెరికాలో ప్రజాస్వామ్యమే ఉంది. రాచరికం లేదు. అక్కడి పౌరులు ఎవరైనా అధ్యక్షపదవికి తలపడొచ్చు. ప్రజాభీష్టం మేరకు ఎవరైనా అధికారంలోకి రావచ్చు. ట్రంప్ అధ్యక్షునిగా ఎన్నికైన తరువాత అమెరికాలో కూడా స్థానికత అంశం ప్రాధాన్యతను సంతరించుకున్నది. ఇతర దేశాల నుంచి వచ్చినవారే ఉద్యోగాలు కొల్లగొడుతున్నారని, అమెరికా సంపదను ఎగరేసుకుపోతున్నారని ట్రంప్ ఎన్నికల్లో జరిపిన ప్రచారం ఆయనకు మంచి ఫలితాన్నే ఇచ్చింది. ఆ అంశాన్ని దృష్టిలో పెట్టుకునే ఒబామా తన వీడ్కోలు ప్రసంగంలో ఎవరైనా అమెరికా సింహాసరం అధిరోహించవచ్చని చెప్పారు. కులాలకు, మతాలకు అతీతంగా అమెరికా పౌరులు ఎవరైనా ఎన్నికల్లో తలపడి విజయం సాధించవచ్చు. అమెరికా రాజకీయాల్లో ఇండియన్స్ అందులో హిందువులు చురుగ్గా పాల్గొంటున్నదున హిందువులైనా రావచ్చని ఒబామా పేర్కొనడం తాను ప్రాంతీయవాదానికి వ్యతిరేకమని స్పష్టం చేసినట్లయింది.

**రాజధాని భూముల్లో జగన్ మోహన్‌రెడ్డి పర్యటనను అడ్డుకోవడం సరైనదేనా....**

ప్రభుత్వం ఆ రకమైన నిర్ణయం ఎందుకు తీసుకుందో అర్థం కావడం లేదు. ప్రజా సమస్యలను తెలుసుకునేందుకు వాటి పరిష్కారానికి ప్రభుత్వం పై ఒత్తిడి తెచ్చేందుకు ఎవరైనా ఎక్కడైనా పర్యటించవచ్చు. కాన మన తెలుగురాష్ట్రాల్లో ప్రభుత్వాలు ప్రతిపక్ష పార్టీల నేతల పర్యటనలపైన నిర్బంధాన్ని విధిస్తున్నాయి. ప్రజాస్వామ్యంలో ఇది సరైన పద్దతి కాదు. ప్రతిపక్ష పార్టీలు ప్రజల్లో ఉండి వారి సమస్యలను ప్రభుత్వం దృష్టికి తేవాలి. ఆ సమస్యల పరిష్కారానికి ప్రభుత్వాలు ప్రయత్నించాలి.

**ప్ర: నోట్ల రద్దుతో ముందు ముందు ప్రయోజనాలు ఎన్ని ఉన్నా...ప్రస్తుతం మాత్రం ఎక్కువగా అతివలు కష్టాలపాలవుతున్నారు. ఢిల్లీ పెద్దలకు ఇవన్నీ చిన్న విషయాలు...దానికి తోడు చంద్రబాబులాంటి బాధ్యతాయుత నేతలు కూడా పెద్ద నోట్లను తానే రద్దుచేయించినట్లు గొప్పగా చెప్పుకుంటున్నారు...నగదు రహిత లావాదేవీలకు రమ్మని చాలా ఈజీగా సూచనలు ఇస్తున్నారు...ఇవన్నీ అమలులో సాధ్యమయ్యేవేనా?**

**-ఎన్.గోపీకిషన్, సురారం**

జ: బాధ్యతాయుతమైన స్థానాల్లో ఉండే పెద్దలు ఆచి తూచి మాట్లాడాలంటారు. లేకపోతే అభాసుపాలవుతారు. మోడీ ప్రభుత్వం పెద్ద నోట్లను రద్దు చేసిన వెంటనే ఎపి సిఎం చంద్రబాబు స్వాగతించారు. పెద్దనోట్లను రద్దు చేయాలని తానెప్పుడో మోడీకి లేఖ రాసినట్లు ఆయన గొప్ప కబుర్లు చెప్పారు. నోట్లరద్దుతో చంద్రబాబు అనేక సార్లు మాటలు మార్చారు. ప్రజలు ఇక్కట్లు పడుతున్నారన్నారు. రెండు వేల రూపాయల నోట్లనూ రద్దు చేయాలన్నారు. నగదును సరిగా పంపిణీ చేయడం లేదంటూ బ్యాంకు ఉద్యోగులపై మండిపడ్డారు. కరెన్సీ కష్టాలపై ప్రతిరోజూ సమీక్షలు చేస్తూ సలహాలు ఇస్తున్నారు. చివరకు ఆయన ఏమి ఏమి మాట్లాడుతున్నారో తెలియడం లేదని అధికారులు అయోమయంలో పడుతున్నారు.

## మెయిల్ అడ్రస్

SPR publications, Surya Soudha, Plot.No: 185,
M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar,
Chandanayak Thanda, Madhapur, Opp: Hi-Tech City, Hyderabad - 500 072

# లెజెండ్

# మాక్స్‌ప్లాంక్ క్వాంటమ్ థీరీ



**ఐన్ స్టీన్ సాపేక్ష సిద్ధాంతం ఎంతటి బ్రహ్మపదార్ధమో మాక్స్ ప్లాంక్ క్వాంటం థీరీ కూడా అలాంటిదే .జర్మనీదేశంలో కీల్ నగరంలో 23-4-1858న మాక్స్ ప్లాంక్ జన్మించాడు .అతని జీవితకాలం జర్మన్ సామ్రాజ్య ఉత్తాన పతనాలతో ముడిపడి ఉంది. తండ్రి కాన్ని ట్యూషనల్ లా లో ప్రొఫెసర్. సైన్సుకున్న మానవీయ బాధ్యతలను కొడుక్కి ఎప్పుడూ గుర్తు చేస్తుండేవాడు .దేనినైనా ప్రయోగాత్మక పరిశోధన తోనే నమ్మాలి అని బోధించేవాడు.**

యువ ప్లాంక్ మ్యూనిచ్‌లోని మాక్సి మిలీనియం జిమ్నేషియంలో లెక్కలు ముఖ్య విషయంగా చదివాడు. చిన్నప్పటినుండి ఈ ప్రపంచం మనిషికంటే ఎదోరకమైన స్వతంత్రాన్ని కలిగి ఉంది అనిపించేది. తండ్రితో బాటు అతని హైస్కూల్ టీచర్ మూలర్ కూడా ప్రోత్సహించాడు. హాస్యాన్ని మిళితం చేస్తూ ఆయన బోధించే విధానం ప్లాంక్‌కు బాగా నచ్చింది. కన్సర్వేషన్ ఆఫ్ ఎనర్జీని చాలా చక్కగా ఉదాహరణగా బోధించిన తీరు మర్చిపోలేదు. మూలర్ దాన్ని వివరిస్తూ ఒక పెద్ద రాయిని కట్టే బిల్డింగ్ మీదకు మనం ఏంతో శక్తి వినియోగించి చేర్చాలి. శక్తి ఎప్పుడూ నశించదు అది దానిలో కొన్నేళ్ళవరకు నిలవ ఉంటుంది. దురదృష్టవశాత్తు అది ఒకవేళ ఏదో ఒక రోజు అక్కడ పట్టు తప్పి వదులైతే, దాచుకున్న శక్తినంతా దారినపోయే దానయ్య నెత్తిమీదపడి బుర్ర బద్దలు చేస్తుంది అని చెప్పాడు ప్లాంక్ . ఆయనను ప్రభావితం చేసినవాడు మూలర్ .

హైస్కూల్ లో గ్రాడ్యుయేషన్ పూర్తి చేసి మొదట మూడేళ్ళు మ్యూనిచ్ యూనివర్సిటిలో, మరో ఏడాది బెర్లిన్ యూనివర్సిటీలో చదివాడు. బెర్లిన్‌లో హెల్మ్ హోల్జ దగ్గర చేరాడు .ఆయన ఫిజియాలజిస్ట్ మాత్రమే కాక ఫిజిసిస్ట్ కూడా. కానీ బోధన ఆకర్షణీయంగా ఉండేదికాదు. ఆయనక్లాస్ అంటే బోర్ అనిపించేది. కాని ఫిజికల్ కెమిస్ట్ అయిన కిర్చాఫ్ ప్లాంక్‌కు దేర్మో డైనమిక్స్‌పై ఆసక్తికలిగించాడు. అందులో ముఖ్యంగా రెండవ ధర్మో డైనమిక్స్ లా పై అధిక ఆసక్తికలిగించాడు. దీనినే పరిశోధన అంశంగా తీసుకొని 1879లో డాక్టరేట్ పొందాడు. ఈ సూత్రమే మిగిలిన పరిశోధనలకు కేంద్రమైంది .అతని తెలివితేటలకు ప్రతిఫలంగా కీల్ యూని వర్సిటీలో 28 ఏళ్ళకే అసోసియేట్ ప్రొఫెసర్ అయ్యాడు .కిర్చాఫ్ మరణం తర్వాత బెర్లిన్ యూనివర్సిటిలో ప్రొఫెసర్ ఎక్స్ట్రా ర్డినరస్ అయిపోయాడు.

1879 నుండి 1899 వరకు ఇరవై ఏళ్ళు ప్లాంక్ దేర్మల్ రేడియేషన్ సమస్యపై తీవ్రంగా పరిశోధనలు చేశాడు .అప్పటికి తెలిసిన విషయం ఏమిటి అంటే వేడివస్తువులు ఉష్ణ వికిరణం(రేడియేషన్ ) చేస్తాయి..ఉష్ణం ఇంకాపెరిగితే కాంతిని వెదజల్లుతాయి..వేడి ఎక్కువైతే ఈ కాంతి కనపడని ఇన్ఫ్రా రెడ్ నుండి, కాంతి హీన ఎరుపునకు, సింధూరం ఎరుపునకు (స్కార్లెట్) చివరికి పసుపురంగుకు మారుతుంది . ఇంకా వేడి ఎక్కువైతే తెల్లని వేడి (వైట్ హాట్ )గా మారతాయి . ప్రతి ఉష్ణోగ్రత వద్ద వెలువడే రేడియేషన్‌ను ప్రిజం (పట్టకం) ద్వారా విశ్లేషించవచ్చు. అది కొన్ని రంగుల సమూహంగా, ప్రతి రంగుకు ఒక నిర్దిష్ట వేవ్ లెంగ్త్ (తరంగ దైర్ఘ్యం )తో వెలువడుతుంది .ఉదాహరణకు ఒక ఇనప ముక్కను ఇలా పసువు రంగు వచ్చేదాకా వేడి చేస్తే,అప్పుడది నిజంగానే రెడ్,ఆరంజ్,ఎల్లో,గ్రీన్ బ్లూ రంగులసముదాయాన్ని ఇస్తుంది అందులో గ్రీన్ బ్లూ చాలా తక్కువ కాంతితో ఉంటె ఎల్లో చాలా ప్రకాశామానంగా ఉంటుంది .

కిర్చాఫ్ శాస్త్ర వేత్త ఇలా కనిపించే రంగులనేకాక , రంగుల పంపకం ఉష్ణం మీదనే తప్ప పదార్ధం మీద ఆధారపడి ఉండదు అని కనుక్కున్నాడు .ఈ స్వతంత్రం టెంపరేచర్ ,వేవ్ లెంగ్త్ లకే చెందిన ఒక ప్రక్రుతి సిద్ధాంతానికి దారి తీసింది. దీనిపై చాలా పరిశోధనలు జరిగాయి సిద్ధాంతాలు వచ్చాయి. కలర్ డిస్ట్రిబ్యూషన్ విషయంలో ఏదైనా ఫార్ములా ఉండి ఉండాలని అనిపించింది ఈ డిస్ట్రిబ్యూషన్ వర్ణమాల (స్పెక్ట్రం)లో ఏదో కొద్ది మేర కే ఉన్నట్లు గమనించారు .

ఇప్పుడు మాక్స్ ప్లాంక్ ఒక కొత్త సూత్రం కనిపెట్టే పనిలో మునిగిపోయాడు. బ్లాక్ బాక్స్ అంటే బోలుగా ఉండే వస్తువు రేడియేషన్‌పై పరిశోధన సాగించాడు . దాన్ని వేడి చేస్తే దాని లోపలి ఒకవైపు గోడలు రేడియేషన్‌ను వెదజల్లితే, ఎదురుగా ఉండే గోడలు రేడియేషన్‌ను హారిచి (అబ్సార్బ్ )నట్లు గమనించాడు. ఈ బ్లాక్ బాడీ లేక కేవిటీ రేడియేషన్ కోసం మెథడ్ ఆఫ్ లిమిట్స్ ను ఉపయోగించక తప్పదనుకున్నాడు. ఇదిఫిజిక్స్, లెక్కలలో బాగా శక్తివంతమైన ఆయుధం వంటిది. ఎప్పుడైతే సూటిగా గణనకు (కంప్యుటేషన్ )కండిషన్లుఉపయోగపడవో అప్పుడే దీన్ని సంజీవినిలాగా వాడుతారు. ఇది ఒక కృత్రిమ నియమాన్ని (కండిషన్)ను ఏర్పరచి మనం సాధించాలనుకొనే ఫలితానికి తోడ్పడుతుంది. అప్పుడు మనకు కావాల్సిన ఫార్ములా వస్తుంది. ఇందులో అవాస్తవిక ఊహ (ఫాల్స్ అస్సప్షన్) కూడా ఉంటుంది. క్రమంగా క్రుత్రిమతను తగ్గించుకుంటూ సున్నా దాకా పోతారు. అప్పుడు మనం కోరుకొనే ఫార్ములా వస్తుంది అందులో కల్పించిన కృాత్రిమత ఉండదు .ఇదేసరైన మాధానంగా అన్ని పరీక్షలకు తట్టుకొని నిలబడుతుంది. ప్లాంక్ బ్లాక్ బాడీ రేడియేషన్ నిరంతర ప్రవాహం అని, ప్రతిరంగు శక్తితో ఉంటుందని నమ్మాడు. ఇక్కడే ప్లాంక్ పొరబడ్డాడు .నిరంతరరేడియేషన్ ప్రవాహంగా కనిపించేదానిలో. చిన్న చిన్న శక్తి విస్ఫోటనాలు (బరస్ట్)ఉన్నాయి. ప్రతి విస్ఫోటనాకికి నిర్ణీత శక్తి ఉంటుంది .ముందు ఫార్ములా సాధించి తర్వాత వీటి సంగతి చూద్దాం అనుకొన్నాడు. చివరికి ప్లాంక్ ఫార్ములా ఖచ్చితంగా ప్రయోగాత్మక కొలతలకు సరిపోయింది. ఈ దశలో కొందరు శాస్త్ర వేత్తలు తమ కృత్రిమ ఊహలు నిజంగానే నిజమయ్యాయని భావించారు.



కేవలం స్వశక్తితో పైకివస్తారు కొందరు. వారి దగ్గర అదృష్టాన్ని గురించి మాట్లాడడం నిష్ప్రయోజనం. -ఇట్ బవై.

# నల్లని రాగం

జ్ఞాపకంలోకి మెలుకువ
నిజంలోకి పరకాయ ప్రవేశం
తిరునాళ్ళలో తప్పిపోయిన
పిల్లాడు
తిరిగొచ్చి అమ్మ చుట్టూ పోరాడి
నట్లు
నేను కూడా అలా చుట్టినట్లు
ఒక సుదీర్ఘ
మరణం లాంటి
స్పృహలోకి వచ్చినప్పటి సన్ని
వేశం
లోలోపల కుమిలిపోతున్న
దుఃఖ జాడ
కనిపించని కన్నీటిధార
కాలం కత్తికి తెగని ఎదురు
చూపు
విడివిడిగా రాలిపోయే మాటలు
దయామృతాన్ని కురిపించే
చూపులు
జీవనదిలా ప్రవహించే విరహాన్ని
బాసే
కరుణాస్పర్శ
ఒక చలికాలపు రాత్రి
సుస్త చైతన్యంలో అలజడి
చుట్టుకున్న చీకటి చెంత సందడి
మళ్ళీ మళ్ళీ పల్లవించిన నల్లని
పాట
చెదిరిన వర్ణాలన్నీ కలిసిపోయిన
నల్లటి చిత్రం
జీవితమంతా వెంటాడే నల్లని
రాగం

– సంపంగివారి జయ చంద్రారెడ్డి, బాపట్ల, గుంటూరు జిల్లా

## రన్నింగ్ వాయిస్


సూర్య ఆదివారం
మినీ సార్వత్రిక సంగ్రామంలో
గెలుపెవరిది

### పజిల్స్ పెంచాలి

ఈ వారం వింతలు విశేషాలు ఎంతగానో బాగున్నాయి. వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

–హేమంత్, మౌలాలి

### కలర్ పేజీలు

కవర్ పేజీ కథనం సందర్భోచితంగా ఉంటోంది. పబ్లిక్‌ను ఇన్‌వాల్వ్ చేసే శీర్షికలు ఇస్తే బాగుంటుంది. అలాగే పాఠకుల అనుభవాలతో కూడిన ఓ శీర్షిక నిర్వహించండి. యూత్‌ను ఎంకరేజ్ చేసే శీర్షికలు, ఆడవారికి నచ్చే ఐటమ్స్ అన్నీ కవర్ అయితే సండే మరింత జనరంజకంగా ఉంటుంది. అన్నీ కలర్ పేజీలలో ఉండేలా చూడండి.

### వింతలు విశేషాలు

ఈ వారం వింతలు విశేషాలు ఎంతగానో బాగున్నాయి. వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

## 'కూని'రాగాలు

మర్యాద ఎప్పటికీ ముందువరసలోనే..!
తొందరపాటు ఎవరికైనా వెనుకబాటకే..!!

ఒప్పందాన్ని గౌరవిస్తే విలువలు ఉన్నట్టు..!
కప్పదాటు వేస్తుంటే ఉనికిని కోల్పోయినట్టు..!!

సాధ్యాలను బేరీజు వేసుకునే ఆచరించాలి..!
గమ్యాన్ని నిర్ణయించుకునే అడుగేయాలి..!!

ఐక్యత కుటుంబ నేపథ్యం తెలుపుతుంది..!
సభ్యత మానవీయకోణం అలవరుస్తుంది..!!

ఆగ్రహాన్ని నిగ్రహంలో ఉంచితేనే మంచిది..!
ప్రణయంలో ప్రలోభాలు పెంచితే చెడ్డది..!!

- కూనిరెడ్డి శ్రీనివాస్

### కిరాతకుడు...

పరమ కిరాతకుడైన ఓ ఆఫీసర్... ఆ ఊళ్లో ఉండే పెద్ద మనిషి మాట్లాడుకుంటున్నారు.
'మీరు ట్రాన్స్‌ఫర్ అయి వెళ్లిపోతే ఇక ఈ డిపార్ట్‌మెంట్‌కు దిక్కుండదండీ...!'
'అలా అనుకోనక్కర్లేదయ్యా...! నా కంటే మంచివాడు రావచ్చు కదా..?'
'ఊళ్లో వారంతా అదే ఆశతో ఉన్నారండీ...కానీ ప్రతిసారీ పరమకిరాతకులొస్తున్నారు కదండీ!'

### అసలు విషయం చెప్పు...

'అయ్యా! మీకో దుర్వార్త. మీ భార్య కొద్ది రోజుల్లో హత్యచేయబడుతుంది.' కేడీ కనకారావు చేయిచూసి చెప్పాడు జ్యోతిష్యుడు.
'ఆ సంగతి నాకు తెలుసు. ఇంతకీ నేను దొరికిపోతానా? లేదా? అది చెప్పు' అడిగాడు కేడీ కనకారావు.

### కొత్తగా అనిపించలేదండి..!

"ఇదేంటి ఇంత ఇబ్బందిగా అనిపిస్తుంది?" అంది శోభనం గదిలో పెళ్లికూతురు.
"కొత్తకదా అలాగే అనిపిస్తుందిలే..!" అన్నాడు పెళ్లికొడుకు.
"ఇంతకుముందు ఇలా ఎప్పుడూ అనిపించలేదండి..!" అని నాలుక కరుచుకుంది పెళ్లికూతురు.

ఫన్‌చ్ – నారు











ఎంత తెలివైనవాడు అయితే మాత్రం ఏం లాభం? కాస్త అదృష్టవంతుడైతేనే. -జాన్ బెబ్‌స్టర్




# లైఫ్ ఆఫ్ పై

యాన్ మార్టెల్ రాసిన నవల ఆదరంగా దర్శకుడు ఆంగ్ లీ రూపొందించిన లైఫ్ ఆఫ్ పై చిత్రం 2012లో విడుదలై ఆస్కార్ అవార్డుల రేసులో పదకొండు నామినేషన్లు దక్కించుకుని, అందరి దృష్టినీ తన వైపు తిప్పుకుంది. ఉత్తమ చిత్రం, ఉత్తమ సినిమాటోగ్రఫి, ఉత్తమ దర్శకుడు, ఉత్తమ గాయని సహా 11 విభాగాల్లో లైఫ్ ఆఫ్ పై నామినేషన్లు పొందింది.

సముద్రంలో ప్రయాణిస్తున్న ఒక పెద్ద షిప్ మునిగిపోగా అందులో నుంచి బతికిన పై అనే 16 సంవత్సరాల యువకుడు అక్కడి నుండి ఒక చిన్న పడవలో తప్పించుకుంటాడు. పై తో పాటు ఒక బెంగాల్ టైగర్, ఒక కోతి, ఒక జీబ్రా మరియు ఒక హైనాలతో తన జర్నీ ఎలా సాగింది అనే కథాంశంతో ఈ చిత్రం రూపొందింది. పాండిచ్చేరికి చెందిన పై పటేల్ అనే అబ్బాయి, రిచర్డ్ పార్కర్ అనే పులితో కలిసి దాదాపు 227 రోజులు పసిఫిక్ మహా సముద్రంలో ప్రయాణించాల్సి వస్తుంది. పై సాగించిన సాహసోపేత ప్రయాణమే ఈ చిత్రం. ఢిల్లీకి చెందిన సూరజ్ శర్మ ప్రధాన పాత్ర పోషించాడు. మిగతా పాత్రల్లో ఇర్ఫాన్ ఖాన్, టబు, ఆదిల్ హుస్సేన్ కనిపిస్తారు. ఇందులో కర్నాటక గాయని బాంబే జయశ్రీ పాటలు పాడారు.

ఓడ మునగటంతో ఓ కుర్రవాడు వచ్చి లైఫ్ బోట్‌లో పడతాడు అనగానే ఆ విపత్తు పాఠకుడికి వచ్చి పడుతుంది. ఇలా, ఒక్కొక్క కథలో ఒక బతుకు. ఒక్కో బతుకులో చూసే వింత ప్రదేశాలూ, మనుషులూ, జీవులూ, అనుబంధాలూ, ఏడువులూ, నవ్వులూ ఓహ్! కథ చదివినప్పుడు నిర్మితమైన ఊహలు చెక్కు చెదరవు. వాటిని ఎవరూ కూల్చలేరు. ఊహలో దృాఎశ్యాలు మాత్రమే కాదు, శబ్దాలూ, వాసనలు, స్పర్శలూ, రుచులూ వుంటాయి. అందుకే, చదివేసిన కథనే, తెరమీద కొత్తగా చూడాలంటే, ఎంతో కొంత అభద్రత. ఊహ కూలుతుందేమోనన్న భయం.

కానీ లైఫ్ ఆఫ్ పై (ఇంగ్లీషు) చిత్రం ఆ భయం మొత్తాన్ని తీసివేసింది. ఇది ముందు నవల. రాసింది యాన్ మార్టెల్. ఈ నవలకు (2002లో) మ్యాన్ బుకర్ ప్రైజ్ రావటంతో, ప్రపంచమంతటా సాహితీ ప్రియులు ఎగబడి చదివారు. చదివిన ప్రతీ వారూ, సుదీర్ఘకాలం(227 రోజులు) తాము సముద్రంలో ఉండిపోయినట్లు భావిస్తారు. ఇదొక అపురూపమయిన అనుభవం. ఈ నవలను సినిమాగా తీస్తున్నారని వార్త రాగానే, పాఠకులు తమ ఊహ మీద దాడి జరుగుతుందన్నారు. ఈ భయం పాఠకులకే కాదు, కొన్నిసార్లు రచయితలకు కూడా వుంటుంది. తమ కథల్నీ, నవలల్నీ సిని మా లుగా తీశాక, వాటిని చూసి గుండెలు బాదుకున్న రచయితలు ప్రపంచమంతటా వున్నారు. ఆ మధ్య ఇంతే ప్రసిద్ధమయిన నవల గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్‌ను సినిమా తీస్తామని వచ్చినప్పుడు, ఆ నవల రాసిన అరుంధతీ రాయ్ ముందుగానే భయపడి పోయారు. నా నవల దురాక్రమణకు గురవటానికి నేను అనుమతించను అని తెగేసి చెప్పేశారు.

కానీ యాన్ మార్టెల్ అలా కాదు. లైఫ్ ఆఫ్ పై ను సినిమాగా తీయటానికి అనుమతించారు. తీస్తానని ముందు కొచ్చిన దర్శకుడు అంగ్ లీ. ఆయన సామాన్యుడు కాదు. సృజనకు మారు పేరు. దృశ్యాల అంతే. అది సినిమాగా సాక్షాత్కరించింది.

మామూలు కళ్ళతో చూస్తే, ఈ కథను మూడు ముక్కల్లో చెప్పేయవచ్చు: ఓడ మునక, లైఫ్ బోట్‌లో కుర్రాడు, పులి సహయానం, సురక్షితంగా ఒడ్డుకు చేరటం. అందుకే, ఈ సినిమా చూడటానికి అదనంగా నేత్రాలు కావాలి. (ఎలాగూ త్రీ-డీ సినిమా కదా, చూడటానికి అదనంగా రెండు కళ్ళు పైన తగిలించుకోవాలను కోండి!) అవి అంతర్నేత్రాలు. మానవోద్వేగాలను వాటితోనే చూడగలం. ప్రమాదంలో చిక్కుకుని పరిహాసాలాడటమూ, బతుక్కీ చావుకీ మధ్య సరిహద్దును చెరిపేయటమూ, పెనుకోపంలో చిరుజాలిని ప్రకటించటమూ- మామూలు కళ్ళు చాలవు.ఫీలింగ్స్ కథను నడపవు, కథే ఫీలింగ్స్‌ను నడుపుతుంటుంది.






Movie : Life of Pi

| | | |
|---|---|---|
| Directed by | : | Ang Lee |
| Produced by | ; | Gil Netter, Ang Lee David Womark |
| Screenplay by | : | David Magee |
| Based on | : | Life of Pi by Yann Martel |
| Starring | : | Suraj Sharma Irrfan Khan Tabu Rafe Spall Gérard Depardieu |
| Music by | : | Mychael Danna |
| Cinematography | : | Claudio Miranda |
| Edited by | : | Tim Squyres Production |
| company | : | Fox 2000 Pictures Distributed by 20th |
| Century Running time | : | 127 minutes[2] |
| Budget | : | $120 million[8] |
| Box office | : | $609 million[8] |

పరంపరలో అప్పుడే పెనువేగం- అంతలోనే ప్రశాంతత వుంటాయి. ఎప్పుడూ చూడని వింతా, ఎంతో పరిచితమైన చింతా పక్కపక్కనే కదులుతుంటాయి. దశాబ్దం క్రితం ఆయన తీసిన క్రౌచింగ్ టైగర్, హిడెన్ డ్రాగన్‌కు అన్ని దేశాల ప్రేక్షకులనుంచి ప్రశంసలు వచ్చాయి. మార్షల్ ఆర్ట్స్ ను పతాక స్థాయిలో చూపిస్తారాయన. గురు,శిష్య సంబంధానికి ఇదే చిత్రంలో కొత్త భాష్యం చెబుతారు. అంతటి మహా కళాకారుడి చేతికి లైఫ్ ఆఫ్ పై చిక్కింది.నేను సినిమాలను వెతుక్కోను. నా సినిమాలే నన్ను వెతుక్కుంటాయి. అంటారా యన. నిజమే. లైఫ్ ఆఫ్ ఆఫ్ పై లీని వెతుక్కుంది. సాహసాన్నీ, తత్వాన్నీ- పడుగూ, పేకల్లా పేనుకుంటూ వెళ్ళిపోయాడు రచయిత. అదే లీ కోరుకునేది.





మేధస్సును గురించి గొప్పగా చెబుతుంటారు అందరూ. కాని మానవ జీవితాన్ని నడిపించేది అదృష్టమే కాని మేధస్సు కానేకాదు. -సి.సి.రో





డాక్టరు కాబోయి యాక్టరయ్యా'ననడం సినిమానటులకు నాలుక చివరుండే నానుడి. దీనికి కొద్ది దగ్గరలో డాక్టర్ కాబోయి కెమరామన్ అయినవాడు పి.జి.వింద. ఫిల్మాటోగ్రఫీలో పట్టాపొంది మధు అంబట్ వద్ద అసిస్టెంట్ కెమరామన్‌గా పనిచేశాడు. ఆ తర్వాత కొన్ని డాక్యుమెంటరీలు, యాడ్ ఫిలింలూ తీసి, 'గ్రహణం'తో పరిశ్రమ కంట్లో పడ్డాడు. 'నందనవనం 120 కి.మీ.', 'అనుమానాస్పదం', 'అష్టాచెమ్మా', 'వినాయకుడు' లాంటి డజను చిత్రాలకు ఛాయాగ్రాహకుడిగా పనిచేశాడు. చిల్డ్రన్స్ ఫిలిమ్ 'లోటస్ పాండ్'తో డైరెక్టరుగా మారాడు. తన అందమైన అనుభవాల రీలుని కెమరాకన్నులో సెట్ చేసి 'హ్యాపీడేస్' రూపంలో మనకు చూపబోతున్నాడిలా.

# డాక్టర్ కావాలనుకుని కెమెరామెన్ అయ్యా

## –పి.జి.విందా

కౌమార, యవ్వన దశలతో పోలిస్తే నా మనసుపై గాఢమైన ముద్ర వేసింది మాత్రం బాల్యమే. అప్పటి అనుభవసారమే జీవితంలో సరైన దిశగా అడుగులు వేయడానికి దిక్సూచిలా పనిచేసింది. ఆ అందమైన బాల్యం తాలూకూ జ్ఞాపకాలన్నీ ఇప్పటికీ తడి తడిగా, తాజాగా పరిమళిస్తూనే ఉన్నాయి. మహబూబ్‌నగర్ జిల్లా, నాగర్‌కర్నూల్‌కు సమీపంలో ఉన్న 'పాలెం' మా ఊరు. స్థానికంగా వెంకటేశ్వరుడి గుడి ఉండడంతో 'దేవుని పాలెం'గా ప్రసిద్ధి. వ్యవసాయక కుటుంబం కావడంతో పాడిపంటలతో మమేకమై గడిచిన బాల్యం నాది. పొలం పనులతో పాటు, పితికిన పాలను ఇంటింటికి వెళ్లి పోసి వచ్చేవాణ్ణి. ఇన్ని పనులు చేస్తూ కూడా చదువులో క్లాస్ ఫస్ట్ అంటే మాటలు కాదు కదా. అంచేతే సెవెన్త్ పూర్తవగానే ఎ.పి. రెసిడెన్షియల్ సీటు దానంతకదే నన్ను వెదుక్కుంటూ వచ్చింది.

### బాల వైద్యశిఖామణిగా...

నాన్న అప్పుడప్పుడు నాటు వైద్యం



చేస్తుండేవాడు. తేలు కుట్టినా, గాలి సోకినా జనం ఆయన దగ్గరకు వచ్చి మంత్రం వేయించుకునేవాళ్లు. ఒకసారి నాన్న ఊర్లో లేనప్పుడు ఒకావిడ కడుపునెప్పితో బాధపడుతూ వచ్చింది. అప్పటికే సైన్స్ ప్రకారంగా ఉప్పు, చక్కెర కలిపిన నీటిని తాగిస్తే కొంత ఉపశమనం కల్గుతుందని కనిపెట్టాను. ఆవిడ ముందే కాస్త ఉప్పుని చేతిలోకి తీసుకుని నా కొచ్చిన భాస్కర శతకం శ్లోకాల్ని రెప్పలు అల్లాడించి చదువుతూ మంత్రించినట్టు ఫోజు కొట్టాను. ఆమె నిజంగానే మంత్రం చదువుతున్నానని అనుకుంది. శ్లోకం చదివేసి నీటిలో ఆ ఉప్పుని, చక్కెరను కలిపి తాగించాను. ఆవిడ కొద్దిసేపట్లోనే తేరుకుని 'నీ కడుపు సల్లగుండా, తగ్గిందయ్యా' అని దీవించి వెళ్లింది. అలా బాలవైద్య శిఖామణిగా వెలిగిపోయా. చేపల వేట కూడా యమ సరదాగా ఉండేది మొదట్లో. ఒకసారి బురద కుంటలో దిగి చేపనుకొని పాముని పట్టుకున్నాను. అంతే! ఆ దెబ్బతో మళ్లీ ఎప్పుడూ చేపల జోలికి వెళ్లే లేదు. మొహర్రం వచ్చినప్పుడు అలాయ్ మధ్యలో కాల్చడానికి తొట్టిగ్యాంగుతో కలిసి కర్రమొద్దుల్ని దొంగిలించి తెచ్చేవాణ్ణి. ఆ మర్రోజు ఆ ఇంటివాళ్లతో తిట్లు మామూలే.

### అడ్వంచర్ బుర్రలే...

బీచుపల్లి ఎ.పి. రెసిడెన్షియల్ గురుకుల పాఠశాలలో చదివేరోజుల్లో నేను చేసిందంతా అడ్వంచరే. మా హాస్టల్ పక్కనే కృష్ణానది ప్రవహించేది. చుట్టూతా చిట్టడివి. అడవి మధ్యలో కలువల కొలనుండేది (నా 'లోటస్ పాండ్' సినిమాకు ప్రేరణ). వనవాసంలో తిరిగే రామ, లక్ష్మణ, ఆంజనేయుల్లా మాకు మేమే ఊహించుకుని ధనుర్బాణాలతో సంచరించేవాళ్లం. వెదురు బద్దలతో ధనుస్సు, బాణాలూ తయారుచేసుకునేవాళ్లం. ఒకసారి గురిచూసి నా (రామ) బాణంతో ఒక పావురాన్ని కింద పడగొట్టేశాను. తర్వాత దాని బాధ చూసి చాలా జాలేసింది. పావురాన్ని హాస్టల్‌కి తీసుకొచ్చి ప్రథమ చికిత్స చేశాం. దాన్ని మా దగ్గరే ఉంచుకుని రోజూ గింజలు వేస్తూ, నీరు తాగిస్తూ అది కోలుకునేలా చేశాం. స్టడీ అవర్స్‌లో ఎవడైనా చదువుతూ చదువుతూ కునికాడంటే చాలు వాడికి నా దగ్గరున్న రంగుల్తో మీసాలు పెట్టేవాణ్ణి. మీసాలు ఎవడికైతే ఉన్నాయో వాడు పడుకున్నట్టు లెక్క. మీసాలరాయుళ్లను చూడగానే టీచర్ బెత్తానికి పని చెప్పేవాడు.

డిగ్రీ అయ్యాక సరాసరి హైద్రాబాద్ వచ్చేసి జెఎన్‌టియు ఫిలిం ఆటోగ్రఫీ కోర్సులో చేరిపోయాను. చివరి సంవత్సరంలో ప్రముఖ ఛాయాగ్రాహకుడు మధు అంబట్ వద్ద అసిస్టెంట్ ఫోటోగ్రాఫర్‌గా ('లజ్జ' హిందీ సినిమాకి) అవకాశం రావడం, తర్వాత నా మిత్రుడు అల్‌తాఫ్ ద్వారా మోహనకృష్ణ ఇంద్రగంటి పరిచయం, 'గ్రహణం' సినిమాకి తొలిసారిగా కెమెరామన్‌గా చేయడం ... ఆ మధ్య చిల్డ్రన్ ఫిలిం 'లోటస్ పాండ్'తో దర్శకుడిగా మారడం ... ఏం చేసినా అన్నీ తెరవెనకే ఉండి చేశాను. ఇప్పుడు నా 'హ్యాపీ డేస్' పంచుకోడానికి మాత్రం ఇలా మీ ముందుకు వచ్చాను.

### ఎంకిపెల్లి సుబ్బి చావుకు...

నిజానికి పొట్టేళ్ల దెబ్బకు ఫోటోగ్రఫీపై ఏవగింపు కలగాలి కానీ రివర్స్‌గా కెమెరాపై మోజు పెరిగింది నాలో. చిత్రలేఖనానికీ, శిల్పకళకీ, ఫోటోగ్రఫీకీ అంతర్లీనంగా ఏదో అవినాభావసంబంధం ఉందనిపించేది. మా స్కూల్లో తెప్పించే హిందూ పేపర్‌లో ఎం.ఎఫ్. హుస్సేన్, జెమినీరాయ్, అర్పితా రాయ్ లాంటి చిత్రకారుల గురించి చదువుతున్నప్పుడు మాత్రం జీవితంలో ఏదో సాధించాలనే పట్టుదల అంతర్లీనంగా బలపడుతూ ఉండేది. పాలెం వెళ్లినప్పుడల్లా నా మిత్రుడు రాధాకృష్ణన్ (ఆనంద్, గోదావరి చిత్రాల మ్యూజిక్ ఫేం) కలిసేవాడు.

పాపార్జునరావు అనే ఆయన మా డ్రాయింగ్ టీచర్. తనకు ఫోటోగ్రఫీ హాబీ. స్కూల్లోనే ఒక డార్క్‌రూం కూడా ఏర్పాటు చేసుకున్నాడు. రకరకాల పక్షులను, ఉడతలను, పూలను, మేఘాలను, కృష్ణానదిని ... కంటికి ఏవి కనిపించినా వదలకుండా తన కెమెరాలో బంధించేవాడు. ఒకసారి రెండు పొటేళ్లు గాల్లో ఎగురుతూ ఢీ కొట్టుకునే ఫోటో తీయాలని నిశ్చయించుకుని, పొట్టేళ్లని వెతికి తెమ్మని మాకు పురమాయించాడు. ఇద్దరం వెళ్లి అతి కష్టం మీద ఒక గొర్రెల మందలో జొరబడి పొట్టేళ్ల కొమ్ముల్ని గట్టిగా పట్టుకుని ఈడ్చుకొచ్చాం. తెచ్చాం సరే, అవి రెండూ గాల్లోకి ఎగిరి ఒకదానికొకటి ఢీ కొట్టుకోడం ఎలా? ఎట్లయినా వాటిని గాల్లోకి ఎగిరించి ఢీ కొట్టించాలనే పట్టుదల మాది.

ఆలోచించి చించి వాటి తోకల్లేపి ముల్లు గుచ్చాం. మా సారువాడు అవి ఎప్పుడు గాల్లోకి లేచి ఢీ కొట్టుకుంటాయా అని ఊపిరి బిగబట్టి కెమెరాతో రెడీగా ఉన్నాడు. అవేమో ముల్లు దిగగానే బాధతో 'మే' అంటూ కొద్దిగా కదులుతున్నాయి తప్పించి గాల్లోకి ఎగరడం లేదు. మొదట్లో పిల్లకాయల ఆటలనుకుని సహకరించాయి గాని, తోకలేపి ముల్లు గుచ్చేసరికి గుర్రుమన్నాయ్. 'ఎక్కడ కుమ్మితే దిమ్మతిరిగి మనుషుల మైండ్ బ్లాక్ అవుద్దో' వాటికి బాగా తెలిసినట్టుంది. గురిచూసి గుప్పించి ఫెడేల్మనిపించి ఆ పట్టపగలే మా ఇద్దరికీ చుక్కలు చూపించి రెప్పపాటులో మాయమయ్యాయి. ఇంకేముంది? సీన్ కట్ చేస్తే – కెవ్వుకేక!

### డాక్టరు కావాలనుకున్నా

నిజానికి పొట్టేళ్ల దెబ్బకు ఫోటోగ్రఫీపై ఏవగింపు కలగాలి కానీ రివర్స్‌గా కెమెరాపై మోజు పెరిగింది నాలో. చిత్రలేఖనానికీ, శిల్పకళకీ, ఫోటోగ్రఫీకీ అంతర్లీనంగా ఏదో అవినాభావసంబంధం ఉందనిపించేది. మా స్కూల్లో తెప్పించే హిందూ పేపర్‌లో ఎం.ఎఫ్. హుస్సేన్, జెమినీరాయ్, అర్పితా రాయ్



లాంటి చిత్రకారుల గురించి చదువుతున్నప్పుడు మాత్రం జీవితంలో ఏదో సాధించాలనే పట్టుదల అంతర్లీనంగా బలపడుతూ ఉండేది. పాలెం వెళ్లినప్పుడల్లా నా మిత్రుడు రాధాకృష్ణన్ (ఆనంద్, గోదావరి చిత్రాల మ్యూజిక్ ఫేం) కలిసేవాడు. ఇద్దరం ఒక ప్లేగ్రౌండులో కూర్చుని అప్పటివరకూ విడివిడిగా మేం కన్న కలలన్నీ ఒకదగ్గర పోగేసి చర్చించుకునేవాళ్లం.

మా మాటలు వినే మిగతా ఫ్రెండ్స్ మాకేదో పిచ్చి పట్టిందని ఎగతాళిగా నవ్వుకునేవాళ్లు. ఇంటర్మీడియట్ పాలెంలోనే చదివి డాక్టర్ అయిపోవాలని ఎం.సెట్. కూడా రాశాను. మెడిసిన్‌లో సీటు రాకపోవడంతో కర్నూల్ వెళ్లి సిల్వర్‌జూబ్లీ రెసిడెన్షియల్ డిగ్రీ కాలేజీలో చేరిపోయా. అక్కడ సినిమాలకు కొదవలేదు. సమయం దొరికితే చెక్కేసేవాళ్లం. ఒకసారి రెండో ఆట చూసి వచ్చి హాస్టల్ గేటు దూకబోతుంటే మా ప్రిన్స్‌పాల్ కాచుకుని ఉన్నాడు. నా లక్కేంటంటే ఆ మర్రోజే వాళ్ల అమ్మాయి పెళ్లి కాబట్టి రెండు చీవాట్లతో సరిపెట్టి వదిలేయడం.



తెలుసుకోండి'లా'

# గృహహింస చట్టం పరిధులు



ప్ర: 2008 సంవత్సంలో పెద్దల సమక్షంలో మా బంధువైన ఒక వ్యక్తితో నా వివాహము జరిగినది. 6 నెలల తరువాత మా ఇద్దరిమధ్య కొంత భేదాభిప్రాయం రావడంతో నన్ను మా పుట్టింటికి పంపించాడు. తరువాత అతను ఎక్కడో వేరే పెళ్లి చేసుకున్నాడని తెలిసింది. నాకు నా భర్త చేసిన మోసాన్ని వివరిస్తూ ఒక న్యాయవాది ద్వారా గృహహింస చట్టం క్రింద 2009లో వేసిన కేసులో ఇంతవరకు నాకు ఎలాంటి మనోవర్తిగాని, ఉండడానికి నివాసము గాని లభించలేదు. దీనితో నేను కృంగిపోయి ప్రతివారిని సలహా అడుగుతున్నాను. ఇప్పటివరకు నలుగురు న్యాయవాదులను సంప్రదించాను. ప్రతీచోటా అందరికీ అడిగినంత డబ్బులు ఇచ్చుకుంటూ వస్తున్నాను. ఇదేమిటి అని అడుగగా నీయొక్క ఈ.గ.ఇ లో నివాసము అడుగలేదు అని కొంత, తాత్కాలిక మనోవర్తి అడగలేదు అని, నీకు ఏమి రావు అని కొంత... ఇలా రకరకాలుగా చెప్తుచున్నారు. అయితే మా అత్తమామల సొంత ఇల్లు ఉంది. ఆ ఇంట్లో నివాసం ఉండడానికి నేను ఎలాంటి చర్య తీసుకోవచ్చు? ఈ విషయంలో నా పరిధులేమిటి? వివరించండి.

–నళిని, రాజమండ్రి

జ: మీ పెళ్ళి పెద్దల ద్వారా జరిగినదా లేదా ప్రేమపెళ్ళి చేసుకున్నారా అన్నది ముఖ్యం కాదు. పెళ్ళి జరిగినదా లేదా



అనేదే ముఖ్యం. దీనికి గల అధారాలు, సాక్ష్యాలు ఉన్నాయా? లేవా? అన్నది మాత్రమే ముఖ్యం. గృహహింస చట్టం రాకముందే విడిపోనప్పటికీ ఈ చట్టం కింద భరణం పొందే అధికారం ఉందని కోర్టు పేర్కొంది. ఢిల్లీకి చెందిన ఒక జంటకు సంబంధించిన వైవాహిక కేసును పరిష్కరిస్తు జస్టిస్ అల్తావాస్ కబీర్, జస్టిస్ జె.చలమేశ్వర్‌లతో కూడిన ధర్మాసనం ఈ మేరకు రూలింగ్ ఇచ్చింది. అదే విధముగా భర్త

**ఢిల్లీకి చెందిన ఒక జంటకు సంబంధించిన వైవాహిక కేసును పరిష్కరిస్తు జస్టిస్ అల్తావాస్ కబీర్, జస్టిస్ జె.చలమేశ్వర్‌లతో కూడిన ధర్మాసనం ఈ మేరకు రూలింగ్ ఇచ్చింది. అదే విధముగా భర్త నుంచి విడిపోయిన భార్యకు భర్త ఇంట్లో ఉండే హక్కు ఉందని సుప్రీంకోర్టు స్పష్టం చేసింది.**

నుంచి విడిపోయిన భార్యకు భర్త ఇంట్లో ఉండే హక్కు ఉందని సుప్రీంకోర్టు స్పష్టం చేసింది. అదే విధముగా భార్యకు దీని కింద రక్షణ లభిస్తుంది. ఈ మేరకు డీల్లి హైకోర్టు వాదన సబబే అని పేర్కొంది. అదే విధముగా భార్యకు తన నివాసంలోని గణనీయ భాగాన్ని కేటాయించవల్సిన బాధ్యత భర్తపై ఉంటుందని వివరించింది. వి.డి. భానోత్ భార్య సవితా 2006 నవంబర్ 29న గృహహింస నిరోధక చట్టంలోని సెక్షన్ 12 కింద మేజిస్ట్రేట్ ఎదుట ఒక పిటీషన్ దాఖలు చేశారు. దీంతో భావోత్ నివాసంలోని మొద టి అంతస్తులో ఉండేందుకు వీలు కల్పిం చాలని మేజిస్ట్రేట్ అదేశించారు. దాని ఆధారముగానైనా సరే పెండింగ్‌లో వున్న డి.వి.సి అనగా గృాఎహహింస నిరోధక చట్టం గల కేసులో తాత్కాలికమైన పీటిషన్స్ మూడు. ఒకటి ఖ్టుటజీరు ఎజ్జీచ్చి. రెండవది పోలీసు రక్షణ. మూడవది మీ యొక్క అత్తమామల ఆస్తి అనగా ఇంట్లో ఉండటానికి వసతి అని మూడు పిటిషన్స్ వేసి న్యాయస్థానమునకు నమ్మదగు విధముగా చెప్పి కోర్టు ద్వారా ఆర్డర్స్ తీసుకొని వెళ్ళగలరు. అలాంటి అర్డర్స్ లేకుండా చట్ట విరుద్ధమైన పనులు చేయరాదు. కావున మీరు నేను చెప్పినట్టు 3 పిటిషన్స్ ద్వారా ఆర్డర్స్ తీసుకొని నచో మీ భర్త ఎక్కడ వున్నా, తప్పక న్యాయము జరుగును. అదేవిధముగా మీ భర్త రెండవ పెళ్ళి చేసుకొనినట్లు అధారాలు ఉంటే మాత్రమే కేసు పెట్టగలరు. అధారాలు లేకుండా కేసు పెట్టవద్దు.

ప్ర: 2006లో ఒక వ్యక్తి తో వివాహేతర సంబంధం ద్వారా ఒక బాబుకు తల్లినయినాను. అతను నన్ను పెండ్లి చేసుకుంటానని చెప్పి మోసం చేసినాడు. అతనికి అంతకు ముందు హైదరాబాద్‌లోని ఒక అమ్మాయితో పెద్దల సమక్షములో పెండ్లి అయినట్లు, అతనికి ముగ్గురు కొడుకులు కూడా ఉన్నారని తెలిసినది. నేను మోసపోయానని గమనించిన వెంటనే... మా దగ్గరలోని పోలీసు స్టేషన్‌లో ఫిర్యాదు చేసినాను. కానీ, ప్రయోజనం లేకపోయినది. దీనికి కారణం అతనికి డబ్బు, రాజకీయం అండగా ఉన్నాయి. ప్రస్తుతం నా పిల్లవాన్ని పోషించడం చాలా కష్టంగా ఉన్నది. ఇక్కడ పెద్దలు కూడా నాకు ఎలాంటి న్యాయం చేయడం లేదు, అదేమి అనగా నీవు వివాహేతర సంబంధం ద్వారా పిల్లవాన్ని కనడం నేరం. అతనికి ముందుగా పెళ్ళి అయినట్లు విచారణ చేయకుండా ఎలా ఈ పని చేసినావు అని నన్నే తిట్టుచున్నారు. దీనికి న్యాయ పరిష్కారం చెప్పగలరు.

– రేవతి, నల్లగొండ జిల్లా

జ: ఇలా చాలామంది మోసపోవడం తరువాత బాధపడడం, అనేక రకములుగా జరుగుచున్నవి. దీనికి కారణం అమ్మాయి తొందరప డటం, అదే విధంగా ఇలా మోసగాళ్ళకు బుద్ధి చెప్పలేకపోవడం. అలాగే మన చట్టాలు మన కు సహకరించకపోవడం. ఇలా అనేక రకములుగా అడవాళ్ళు మోసపోవడం జరుగుచున్న ది. అయిన మీరు అధైర్యపడకుండా ధైర్యంగా మీదగ్గరలోని జిల్లా శిశు సంక్షేమ శాఖ ఏజెన్సీ ద్వారాగాని లేక నేరుగా మీ దగ్గరలో కోర్టులో ని ఉచిత న్యాయసేవా కేంద్రములో గాని సంప్రదించి మోసపూరితమైన కేసు (క్రిమినల్) పెట్టుచూ సెక్షన్ 125 క్రిమినల్ ప్రొసీడింగ్ రూల్స్‌లోని సబ్‌సెక్షన్ (బి) క్రింద వివాహమై నా, కాకున్నా... స్వయం పోషణ చేసుకోలేని, మైన రుగా ఉన్న తన సక్రమ లేక అక్రమ బిడ్డకు, అక్రమ సంబంధ మైన... అనగా తల్లికి బిడ్డకు నెల పోషణ, రక్షణ, నివాసం కోసం భరణ పోషణ అనగా నెలసరి రేటు చొప్పున మెజి స్ట్రేటు ఉత్తరువు నీయవచ్చు.

# ప్రయాణ సమయంలో చూడాల్సిన శుభశకునాలు

ధర్మ సింధు యాత్రా గ్రంథం ప్రకారం .... .

దనాదులను ఆర్జించేందుకు, ప్రయాణానికి శుభ నక్షత్రాలైన శ్రవణం, ధనిష్ట, అశ్విని, పుష్యమి, రేవతి, అనూరాధ, మృగశిర, హస్త, పునర్వసు ఉపయోగపడతాయి.

మఘ, చిత్ర, స్వాతి, విశాఖ, అశ్లేష, భరణి, ఆరుద్ర, కృత్తిక, పూర్వాభాద్ర, జన్మనక్షత్రం తదితర నక్షత్రాలు ప్రయాణానికి నిషిద్ధాలు.

అశుభ తిథులు

చవితి, నవమి, చతుర్దశి, షష్టి, అష్టమి, ద్వాదశి, పండుగ రోజులు అశుభాలు.



జ్యేష్ట, ఆశ్లేష, విశాఖ, కృత్తిక, భరణి, పుబ్బ, మఘ నక్షత్ర ప్రారంభ సమయానికి కొంత సమయం వర్జించి, ప్రయాణం చేయవచ్చు.

వారాల శుభాశుభాలు

సోమవారం, శనివారం తూర్పు వైపు

గురువారం దక్షిణం వైపు

ఆది, శుక్రవారాలు పడమర వైపు

బుధ, మంగళవారాలు ఉత్తరం వైపు ప్రయాణం చేయకూడదు.

ప్రయాణ సమయానికి శుభ గ్రహాలు 1,4,7,10,5,9 స్థానాల్లో ఉంటే శుభం.

దుష్ట గ్రహాలు 3, 11, 6, 10 స్థానాల్లో ఉంటే మంచిది.

పదింట శని, ఏడింటి శుక్రుడు, 6,8,12 స్థానాల్లో చంద్రుడు ఉంటే అశుభం.

లగ్నాధిపతి 6,7,12 స్థానాల్లో ఉండకూడదు.

మీన లగ్నంగాని, మీన నవాంశలో గానీ ప్రయాణం చేస్తే, మార్గంలో అతి దుఃఖం సంభవిస్తుంది.

కుజలగ్నాలైన మేష, వృశ్చికాలు, కుంభ లగ్నం, లగ్నం యొక్క నవాంశ కుంభం, కేంద్రాలైన 1,4, 7,10 స్థానాల్లో కుజుడు ఉండకూడదు. కుజుని షడ్వర్గుల్లో లగ్నం ఉండరాదు. మంగళవారం ప్రత్యేకంగా విడవాలి.

లగ్నంలో అస్తరాశి, జన్మరాశి శుభాలు కావు. చంద్రుడు వర్గోత్తమంలో ఉన్నా, లగ్నం వర్గోత్తమం అయినా జయం సంభవిస్తుంది.

ప్రయాణ నియమాలు

ప్రయాణానికి బయలుదేరడానికి ముందు తన వారికిగాని, భార్యకు గాని దుఃఖం కలిగించకూడదు. అస్వస్థతగా ఉన్నప్పుడు ప్రయాణం చేయకూడదు. అకలితో ప్రయాణం చేస్తే కార్యహాని. కోపంతో బయలుదేరరాదు. క్షౌరం, తైల అభ్యంగనం, కన్నీరు, మద్యపానం, మాంస భక్షణం, బెల్లం తినడం, నల్లని బొట్టు, రంగు బొట్టును వర్జించాలి. తేనే, నెయ్యి ప్రయాణం రోజును తీసుకోకూడదు. భార్య రజస్వల అయినా, రుతుకాలంలోనైనా, దుష్ట శకునం ఎదురైనా ప్రయాణం చేయకూడదు. భార్యను, సేవకుడిని సంతోష పెట్టి బయలుదేరాలి. ప్రయాణం వల్ల జయం కలగాలంటే ప్రయాణం ఆరంభించిన రోజు నుంచి గమ్యస్థానం చేరే రోజు, తిథి, వార, నక్షత్రాలు 9వది కాకూడదు. మంచి ముహూర్తానికి వెళ్లడం వీలుకాకపోతే ఇష్టమైన వస్తువును గృహం ముందు ఉంచాలి. అనగా యజ్ఞోపవీతం, తేనే, పళ్లు, సువర్ణం, ధాన్యం, వస్త్రం మొదలైనవి ఉంచాలి.

ప్రయాణమే వృత్తిగా కలిగిన వారికి, తరుచుగా ప్రయాణం చేసే వారికి ఈ నియమాలు వర్తించవు. ప్రత్యేక కార్యాల కోసం వెళ్లేవారు వీలైన శుభాంశాలతో కూడిన ముహూర్తాలు చూసుకుని ప్రయాణం చేయడం వల్ల మంచి కార్య సిద్దిని పొందుతారు. ప్రయాణానికి ముందు కొందరు దేవతలను స్మరించడం కూడా మంచి చేస్తుంది.

శ్లో: 1. యఃశివోనామ రూపాభ్యాం యాదేవీ సర్వమంగళా
తయోః సంస్మరాణాదేవ సర్వతో జయమంగళం.
2. గచ్ఛగౌతమ శీఘ్రుంమే ప్రయాణం సఫలంకురు
ఆసనం శయనం యానం భోజనం తత్ర కల్పయ

అని ప్రార్థన చేసి ప్రయాణం చేయడం వల్ల కార్యసిద్ది ప్రయాణ సౌకర్యం కలుగుతాయి.

సుసర్ల. బాబురావు
ఎం.ఎ (ఆస్ట్రాలజీ)



అంతా నిన్ను అవమానిస్తున్నప్పుడు, వినయంగా వుండడం మంచిది కాదు. కానీ అందరూ నిన్ను ప్రశంసిస్తూన్నప్పుడు వినయంగా వుండడం మాత్రం చాలా అరుదయిన విషయం. -సెయింట్ బెర్నార్డ్

# నన్ను వాడుకుంటున్న ఆ ఇద్దరు హీరోలు

తెలుగు చిత్ర పరిశ్రమలో చలాకీ పిల్లగా పేరొందిన హీరోయిన్ రాశీఖన్నా. ఈ పిల్లలకు సినీ ఛాన్సులు బాగానే వస్తున్నాయి. ఈ పిల్లను ఇద్దరు తెలుగు హీరోలు తెగ వాడేసుకుంటున్నారు. ఆ పిల్ల ఎవరో రాశీఖన్నా. ఈ భామకు అదృాఎష్టం కలిసొచ్చినట్టుంది.

ఇప్పటికే సుకుమార్ దర్శకత్వంలో తెరకెక్కనున్న చరణ్ సినిమాలో హీరోయిన్‌గా ఎంపికైంది. ఆ అనందంలో ఉండగానే మరో బంపర్ ఆఫర్ రాశీకి దక్కినట్టు సమాచారమ్. బాబీ దర్శకత్వంలో ఎన్టీఆర్ ఓ సినిమా చేయబోతున్న విషయం తెలిసిందే. ఇందులో ఎన్టీఆర్ త్రిపాత్రాభినయం చేయబోతున్నాడు. ఈ చిత్రం కోసం ముగ్గురు హీరోయిన్స్‌ని ఎంపిక చేసే పనిలో పడింది చిత్రబృాఎందం.

తాజాగా, ఓ హీరోయిన్‌గా రాశీఖన్నాని తీసుకొన్నట్టు తెలుస్తోంది. మిగిలిన ఇద్దరు హీరోయిన్స్ ఎవరన్నది త్వరలోనే తేలనుంది. ఈ చిత్రం ఫిబ్రవర్ 11న ప్రారంభం కానుంది. ఆ వెంటనే రెగ్యూలర్ షూటింగ్‌కి వెళ్లనున్నారు. జెడ్ స్పీడుతో సినిమాని పూర్తి చేసి ఆగస్టు 11న సినిమాని ప్రేక్షకుల ముందుకు తీసుకొచ్చేందుకు ప్లాన్ చేసినట్టు తెలుస్తోంది. ఈ చిత్రానికి సంగీతం దేవీశ్రీ ప్రసాద్. కళ్యాణ్ రామ్ నిర్మాత.

# ఐస్ తర్వాత ఎమీ జాక్సనే

అందాల రాశి ఐశ్వర్యారాయ్‌కి తర్వాత ఎమీ జాక్సన్‌కు భారీ ఆఫర్లు వస్తున్నాయి. లండన్ బ్యూటీ ఎమీ జాక్సన్ 'ఎవడు'లో రామ్ చరణ్‌తో చేసిన తరువాత మళ్ళీ తెలుగులో మరో మూవీ చేయలేదు. కానీ అమ్మడు క్రేజ్ ఏమాత్రం తగ్గలేదు. ఎందుకంటే.. ఇప్పుడు ఎమీ ఓ క్రేజీ బిగ్ బడ్జెట్ మూవీలో లీడ్ రోల్ చేస్తోంది. సూపర్ స్టార్ రజనీకాంత్ – బాలీవుడ్ స్టార్ అక్షయ్ కుమార్‌తో శంకర్ తీస్తున్న భారీ మూవీ '2.0'లో ఎమీ హీరోయిన్‌గా చేస్తోంది.

అయితే ఇంతకుముందు డైరెక్టర్ శంకర్‌తో ఎమీ 'ఐ' మూవీ చేసింది. విక్రమ్ హీరోగా వచ్చిన ఆ మూవీ ఫ్లాప్ అయ్యింది. అయినా.. శంకర్ '2.0'లాంటి మెగా బడ్జెట్ మూవీలో ఎమీనే హీరోయిన్‌గా తీసుకున్నాడు. అలా శంకర్ ఓ హీరోయిన్‌ని సెకండ్ టైం రిపీట్ చేసింది మనీషా కొయిరాలా, ఐశ్వర్య రాయ్‌నే.

రోబో2లో ఐశ్వర్యరాయ్‌ని కాకుండా ఎమీ జాక్సన్‌ను తీసుకోవడంతో ఆమె చాలా జాగ్రత్తపడి నటిస్తుందట. మూవీ కోసం లండన్ బ్యూటీ చాలా హార్డ్ వర్క్ చేస్తోందట. మూవీలో వుండే యాక్షన్ సీన్ కోసం స్పెషల్ ట్రైనింగ్ తీసుకుందట. అలాగే స్ట్రిక్ట్ డైట్ ఫాలో అవుతూ ఫిట్ వుండడానికి వర్కవుట్స్ కూడా చేస్తోందట. అంతేకాదు.. రోబోలో యాక్షన్ కాకుండా గ్లామర్ రోల్స్ పోషించేందుకు కూడా అమ్మడు రెడీ అయిపోయింది. ప్రస్తుతం ఈ అమ్మడు బికినీ ఫోటోలు ప్రస్తుతం సోషల్ మీడియాలో వైరల్ అయ్యాయి.

పిసినిగొట్టు వాడు పేదవాడుగా కనిపిస్తూ అమిత ధనవంతుడవుతాడు. విలాస పురుషుడు ధనవంతుడిగా కనిపిస్తూనే పేదవాడవుతాడు. -గన్‌స్టన్

# కొత్తా దేవుడండీ..



చూడ్డానికి చాప్లిన్ టైప్ కార్టూన్ ఫేస్‌తో ఉన్నాడు.. ఇతను అమెరికా అధ్యక్షుడేమిటని అందరూ విమర్శించారు. లెక్కలేనన్ని జోకులు కూడా వేశారు. చివరికి అమెరికా వీధుల్లో అత్యంత జుగుప్సాకరంగా ఆయన నగ్న విగ్రహాల్ని కూడా తయారుచేసి పెట్టిన ప్రత్యర్థులు తమ వికృతానందాన్ని ప్రకటించుకున్నారు. కానీ తానేంటో, తన సత్తా ఏమిటో డోనాల్డ్ ట్రంప్ నిరూపించుకున్నాడు. దటీజ్... ట్రంప్... డోనాల్డ్ ట్రంప్! తన గెలుపుతోనే అందరికీ గట్టి సమాధానం ఇచ్చిన అమెరికా వీరుడు డొనాల్డ్ ట్రంప్. ఈ గెలుపు ఎంత గొప్పదంటే, అమెరికా అధ్యక్ష ఎన్నికల్లోనే దీన్ని చారిత్రాత్మక గెలుపుగా ప్రపంచదేశాలు అభివర్ణిస్తున్నారు. ఎందుకంటే డోనాల్డ్ ట్రంప్ స్వతహాగా రాజకీయ నాయకుడు కాదు. ఇంకో వైపున ఆయనకు ప్రత్యర్థిగా నిలబడిన వ్యక్తి అమెరికాలో తలపండిన రాజకీయ వేత్త. విధానాల్లో స్పష్టత ట్రంప్ కన్నా అతని ప్రత్యర్థి హిల్లరీకే ఎక్కువగా ఉంది. మొత్తం మూడు డిబేట్లలో దేంట్లోనూ ట్రంప్, హిల్లరీతో పోటీ పడలేకపోయారు. అన్ని ముందస్తు సర్వేలు హిల్లరీ క్లింటన్‌దే ఘనవిజయం అని ఊదరగొట్టేశాయి. ఎన్నికలకు ఒక్క రోజు ముందు కూడా డోనాల్డ్ ట్రంప్ వెనుకంజలోనే ఉన్నాడని, హిల్లరీ క్లింటన్ ఘనవిజయం తప్పదని అందరూ భావించారు. కానీ ఫలితం తారుమారై ట్రంప్‌ను శ్వేతసౌధానికి రారాజును చేసింది.

అగ్రరాజ్యం 45 అధ్యక్షునిగా ప్రమాణ స్వీకారం

అమెరికా నూతన అధ్యక్షుడిగా డొనాల్డ్ ట్రంప్ జనవరి 20 న అమెరికాకు 45వ అధ్యక్షుడిగా ట్రంప్ ప్రమాణస్వీకారం చేశారు. ఈ సందర్భంగా మేక్ అమెరికా గ్రేట్ ఎగైన్ అనే థీమ్‌తో అంబరాన్ని తాకేలా వేడుకలను నిర్వహించారు. ఈ సందర్భంగా డొనాల్డ్ ట్రంప్ రెండు బైబిల్స్ మీద ప్రమాణం చేశారు. ఒకటి మాజీ అధ్యక్షుడు అబ్రహాం లింకన్ తొలిసారిగా అధ్యక్షుడైనపుడు ఉపయోగించిన బైబిల్, మరొకటి గ్రాడ్యుయేషన్ సమయంలో ట్రంప్‌కు తల్లి బహూకరించిన బైబిల్. ఈ కార్యక్రమానికి భారతీయ-అమెరికన్లు, హాలీవుడ్ ప్రముఖులు పలువురు అతిరథ మహారథులు హాజరయ్యారు. అమెరికా మాజీ అధ్యక్షుడు బరాక్ ఒబామా సారథ్యంలో ట్రంప్ ప్రమాణ స్వీకారోత్సవ వేడుక ఏర్పాట్లు జరిగాయి.

ట్రంప్ ధాటికి అంచనాలు...ఎగ్జిట్‌పోల్స్ తారుమారు

అందరి అంచనాలు, సర్వేలు తారుమారు చేస్తూ అమెరికాలోని మెజారిటీ ప్రజలు ఊహించని విధంగా రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి డోనాల్డ్ ట్రంప్ విజయకేతనం ఎగురవేశారు! ఫలితాల ప్రకటన మొదలైనప్పటి నుంచీ ఆధిక్యంలో దూసుకుపోతున్న ట్రంప్... ఆరోజు మధ్యాహ్నం 01:00 గంట సమయంలో అమెరికా అధ్యక్షుడు కావడానికి అవసరమైన 270 ఓట్లు సాధించారు. ఈ క్రమంలో కనీసం 300కు పైగా ఓట్లు సాధించుకునే పరిస్థితి ఉండటం గమనార్హం. కాగా అప్పటికి హిల్లరీ 218 స్థానాల వద్దే కొనసాగారు. దీంతో ట్రంప్ మద్దతుదారులు సంబరాలు చేసుకున్నారు.అయితే సర్వేలన్నీ హిల్లరీ గెలుస్తారని వెల్లడించడంతో కౌంటింగ్ ముందు ధీమాగా ఉన్న డెమోక్రాటిక్ పార్టీ మద్దతుదారులు ఫలితాల సరళితో డీలా పడిపోయారు.

డోనాల్డ్ ట్రంప్ అనూహ్య విజయం

హిల్లరీకి ఏమాత్రం పోటీనే ఇవ్వలేడనుకున్న ట్రంప్ అనూహ్యంగా విజయం సాధించడంతో హిల్లరీ శిబిరం మూగబోయింది. ఈ ఫలితాలు డెమోక్రాట్లకు ఏమాత్రం మింగుడు పడలేదు. ఎందుకిలా? అని ఆరా తీసినప్పుడు మీడియాని మేనేజ్ చేయగలిగాంగానీ, ఓటర్లను ఆకర్షించలేకపోయామనే వాస్తవం డెమోక్రాట్లకు అర్థమయ్యిందట. రష్యా, చైనా లాంటి దేశాలతో హిల్లరీ క్లింటన్ వైరాన్ని కోరుకున్నారు. ఆ రెండూ అమెరికాకి శత్రుదేశాలే. కానీ వ్యాపారవేత్తగా తన అనుభవాన్ని రంగరించి, అవసరమైతే రష్యా, చైనా లాంటి దేశాలతో సంబంధాలు మెరుగుపరుచుకోవాలని ట్రంప్ చేసిన వ్యాఖ్యలు అమెరికన్లను ఆకట్టుకున్నాయి. ఇలా అన్ని కోణాల్లోంచీ చూసినప్పుడు డోనాల్డ్ ట్రంప్, రష్యా చైనా లాంటి దేశాలతో స్నేహం కోరుకోవడాన్ని అమెరికన్లు హర్షించినట్లుగా భావించక తప్పదనిపిస్తుంది. అమెరికా అధ్యక్ష ఎన్నికల బరిలో ఉన్నప్పుడు ట్రంప్ ఎలా ఉన్నారోగానీ, అధ్యక్షుడిగా గెలిచిన తర్వాత పూర్తి స్థాయి హుందాతనాన్ని ప్రదర్శించారు. ఆయన హుందాతనానికి ప్రపంచ దేశాలన్నీ సెల్యూట్ చేస్తున్నాయి. రష్యన్లు, చైనీయులు కూడా డోనాల్డ్ ట్రంప్‌కి హేట్సాఫ్ చెప్పాయి.

పర్సన్ ఆఫ్ ద ఇయర్

అమెరికా అధ్యక్షుడుగా ఎన్నికయిన డోనాల్డ్ ట్రంప్ ప్రతిష్టాత్మకమైన టైమ్ మ్యాగజిన్ పర్సన్ ఆఫ్ ద ఇయర్ గా ఎంపిక అయ్యారు. ఈ పోటీలో ఉన్న 10 మందిపై కూడా డోనాల్డ్ ట్రంప్ అవలీలగా విజయం సాధించి అత్యంత ప్రతిష్టాత్మకమైన ఈ ఖ్యాతిని స్వంతం చేసుకున్నారు. దీంతో తనకు చాలా సంతోషం కలిగిందని, దానిని ఒక అపూర్వ గౌరవంగా భావిస్తున్నానని డోనాల్డ్ ట్రంప్ చెప్పారు. అమెరికా అధ్యక్ష ఎన్నికలలో ఆయనకి గట్టి పోటీ నిచ్చిన హిల్లరీ క్లింటన్ రన్నర్ అప్ గా నిలిచినట్లు ప్రకటించింది. గత ఏడాది రన్నర్ అప్ గా నిలిచిన డోనాల్డ్ ట్రంప్ ఈసారి పర్సన్ ఆఫ్ ద ఇయర్ గా ఎంపిక అవడం విశేషమే. గత ఏడాది జర్మన్ ఛాన్సలర్ ఆంగెలా మెర్కెల్ పర్సన్ ఆఫ్ ద ఇయర్ గా ఎంపిక అయ్యారు. 1989 నుంచి నేటి వరకు డోనాల్డ్ ట్రంప్ టైమ్ మ్యాగజైన్ కవర్ పేజీపై 10 సార్లు చోటు సంపాదించుకొన్నారు.

మేడమ్ టుస్సాడ్స్‌లో ట్రంప్ బొమ్మ

అమెరికాకు అధ్యక్షుడిగా ఎన్నికైన డొనాల్డ్ ట్రంప్ మైనపు బొమ్మ మేడమ్ టుస్సాడ్స్ లండన్ మ్యూజియంలో కొలువుదీరింది. యూఎస్ఏ అధ్యక్షుడిగా బరాక్ ఒబామా పదవీకాలం ముగియడంతో ఒబామా స్థానంలో డోనాల్డ్ ట్రంప్ బొమ్మను ఏర్పాటు చేశారు. డొనాల్డ్ ట్రంప్ మైనపు విగ్రహాన్ని తయారు చేసేందుకు మేడమ్ టుస్సాడ్స్ మ్యూజియం నిర్వాహకులు ప్రత్యేక జాగ్రతలు తీసుకున్నారు. నేవీ షూట్‌లో వైట్ షర్ట్, రెడ్ టైతో ఆకట్టుకుంటున్నాడు ట్రంప్.

డర్టీ కామెంట్లకే కేరాఫ్ డోనాల్డ్ ట్రంప్!

రాజకీయ నేతలు సాధారణంగా ఉపయోగించే మర్యాదపూర్వక భాష డొనాల్డ్ ట్రంప్ ప్రసంగాల్లో కనిపించదు. బూతు వ్యాఖ్యలు అలవోకగా, యథేచ్ఛగా ఆయన నోట్లోంచి జాలువారుతుంటాయి. అయితే, మనసులో ఒకటి పెట్టుకుని, పైకి మరోలా తాను మాట్లాడనని, తనకేం తోస్తే, ఏం మాట్లాడాలనిపిస్తే.. అదే మాట్లాడుతానని ఆయన చెప్తారు. తప్పొప్పులు సరిచూసుకుని మాట్లాడే అలవాటు తనకు లేదంటారు. అంతేకాదు, తన కామెంట్లు ఎవరినీ నొప్పివ్వవంటారు. వివాదాస్పద, వివక్షాపూరిత వ్యాఖ్యలతోనే ఆయన బాగా పాపులర్ అయ్యారు. ముస్లింలు, బ్లాక్స్, సిరియానుంచి, మెక్సికో నుంచి వస్తున్న వలసదారులు.. మొదలైన వారి గురించి అమెరికాలోని శ్వేతజాతీయుల్లో నెలకొన్న భయాందోళనలను, శ్వేతజాతి యువతలో నెలకొన్న అభద్రతను ఓట్లుగా మలచుకునే ప్రయత్నం ట్రంప్ ప్రసంగాల్లో కనిపిస్తుంటుంది. ట్రంప్ సభలకు ప్రజలు భారీగా హాజరవుతుండటం విశ్లేషకులను ఆశ్చర్యపరిచింది. ఉన్నదున్నట్లు మాట్లాడే తత్వం, సాధారణ ప్రజలు ఉపయోగించే భాషనే ఉపయోగించడం ట్రంప్‌ను మాస్‌కు దగ్గర చేసిందని వారు భావిస్తున్నారు. ప్రసంగాల్లో అప్పుడప్పుడు సభికులను కూడా భాగం చేస్తుంటారు. జార్జియాలో జరిగిన ఒక సభలో ఒబామా ఉత్త తెలివితక్కువ దద్దమ్మ అంటూ ఒక సభికుడు గట్టిగా అరిచాడు. దానికి ట్రంప్ స్పందిస్తూ.. 'ఏదీ మరోసారి చెప్పు' అంటూ అతడిని ఉత్సాహపర్చారు. అతడితో మళ్లీ మళ్లీ ఆ మాటను చెప్పించారు. చివరగా ఇది నేననడం లేదు.. ఆయనే అంటున్నాడు అంటూ ముక్తాయించారు.



ట్రంప్ వివాదాస్పద కామెంట్లలో మచ్చుకుకొన్ని...

0 ముస్లింలు దేశంలోకి రాకుండా నిషేధించాలి.

0 ఇక్కడి బ్లాక్స్ సోమరిపోతులు, నేరగాళ్లు. 2015లో హత్యకు గురైన శ్వేతజాతీయుల్లో 81 శాతం మందిని నల్లజాతి వారే చంపేశారు.

0 అధ్యక్షుడిగా ఒబామా దారుణంగా విఫలమయ్యారు. మరికొన్ని తరాల వరకు మరో నల్లజాతీయుడిని అమెరికా అధ్యక్షుడిగా చూడలేం.

0 మహిళలంటే నాకు అసహ్యం.. అందంగా లేనివారంటే మరింత అసహ్యం.. వారు లావుగా ఉండే పందులు.. అసహ్యకరమైన జంతువులు.. ఐ హేట్ విమన్.

0 మెక్సికో అమెరికాలోకి రేపిస్టులను పంపిస్తోంది.



*1946 జూన్ 14న డొనాల్డ్ ట్రంప్ జన్మించారు. రియల్ ఎస్టేట్ రంగంలో ప్రముఖుడైన తన తండ్రి ఫ్రెడ్ ట్రంప్ స్ఫూర్తితో వ్యాపార రంగంలో అడుగుపెట్టారు. ఇండియాలోని ముంబై, పుణెల్లోనూ రియల్ వెంచర్లు ప్రారంభించారు. మూడు పెళ్లిళ్లు చేసుకున్నారు. ఆయన ప్లేబోయ్‌గా కూడా యూఎస్‌లో చాలా ప్రచారం పొందారు.*

అమెరికా ఉద్యోగాలకు భారతీయులు దూరం ?

అమెరికా విద్య, ఉద్యోగాలకు భారతీయులు దూరం అయ్యే అవకాశాలు కనిపిస్తున్నాయి. అమెరికాకు కొత్తగా ఎన్నికైన అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ ఉద్యోగాల కల్పనపై చేసిన వ్యాఖ్యలు దీనికి బలం చేకూర్చుతున్నాయి. స్థానికులకే ఉద్యోగాలని అమెరికా ప్రెసిడెంట్ ఎన్నికల ప్రచారం సమయంలోనే ప్రకటించినా, అదో ఎన్నికల హామీగానే అందరూ భావించారు. భారత్, చైనాతో పాటు ఆసియా దేశాల నుంచి వివిధ వీసాలపై వస్తున్న వారి స్థానంలో స్వదేశీ ఉద్యోగులకు ఉద్యోగాలు ఇప్పిస్తానని ట్రంప్ వ్యాఖ్యలు చేశారు. అయితే అధ్యక్షుడిగా ఎన్నికైన తర్వాత ట్రంప్ అమెరికాలోని నిపుణులకు దక్కాల్సిన అవకాశాలన్నింటినీ హెచ్1బీ వీసాలపై దేశంలో ప్రవేశిస్తున్న ప్రవాసులు ఎగరేసుకుపోతున్నారు. అమెరికాలోని ఉపాధి అకాశాలు ముందుగా అమెరికన్లకే దక్కాలి అంటూ చేసిన వ్యాఖ్యలు ఇప్పుడు చర్చనీయాంశమయ్యాయి. కాగా అమెరికాలో 9.5 లక్షల మంది భారత్ కు చెందిన శాస్త్రవేత్తలు, ఇంజనీర్లు ఉన్నారు. ఏటా అమెరికాకు వెళ్లే విదేశీ విద్యార్థుల్లో 15.9 శాతం మంది భారతీయులే ఉన్నారు. అమెరికాలో నాలుగువేల వరకు విశ్వవిద్యాలయాలు, కళాశాలలు ఉన్నాయి. ప్రపంచ అగ్రశ్రేణి వంద విశ్వవిద్యాలయాల్లో 46 అమెరికాలోనే ఉన్నాయి. రెండేళ్ల చదువుకు అయిదేళ్ల వీసా ఇస్తారు. కోర్సులో చేరిన 11 నెలల తర్వాత నిబంధనల ప్రకారం ఉద్యోగం చేసుకోవచ్చు.ప్రపంచంలో అమెరికాది బలమైన ఆర్థిక వ్యవస్థ కావడంతో ఎక్కువగా ఉద్యోగావకశాలు దొరకడంతో భారతదేశం ప్రజలు ముఖ్యంగా తెలుగువారు ఎక్కువగా విదేశీ విద్య కోసం అమెరికాకు వెళుతుంటారు. మన దేశం నుంచి 2 లక్షల మంది, తెలుగు రాష్ట్రాల నుంచి దాదాపు ప్రతి సంవత్సరం 25 వేల మంది అమెరికాకు వెళుతున్నారు. చదువు పూర్తయ్యాక కూడా ఉద్యోగాలు చేస్తున్న వారున్నారు. ట్రంప్ వ్యాఖ్యలతో ఇకపై ఈ అవకాశాలు దూరమైతే పరిస్థితి ఏంటనే ఆందోళన తెలుగు రాష్ట్రాల ప్రజలను వెంటాడుతోంది. కొందరు ముందు జాగ్రత్తగా కెనడా, ఆస్ట్రేలియాలో ఉన్నత విద్య కోసం దరఖాస్తు చేసుకోవడంతో గత ఏడాది కంటే 30 శాతం అదనంగా ఈ దేశాలకు దరఖాస్తులు పెరిగాయి. గత ఏడాది కంటే ఈ ఏడాది అమెరికాకు దరఖాస్తుల సంఖ్య తగ్గింది. అయితే ఇదీలా ఉంటే సాంకేతిక నైపుణ్యం ఉండే భారతీయుల సేవలు అమెరికాకు తప్పకుండా అవసరమని, నైపుణ్యం ఉన్న వారు భయపడాల్సిన పనిలేదని విశ్లేషకులు అభిప్రాయపడుతున్నారు.

ఆ ఏడు దేశాలకు గండం

అమెరికా కొత్త అధ్యక్షుడిగా డొనాల్డ్ ట్రంప్ పగ్గాలు చేపడుతుండటం.. నిన్నటివరకూ ప్రత్యర్థిగా ఉన్న రష్యా వంటి కొన్ని దేశాలకు సంతోషాన్నిస్తోంటే.. అమెరికాతో కలిసి నాటో రక్షణ కూటమిలో ఉన్న పలు బాల్టిక్ దేశాలను కలవరపాటుకు గురిచేస్తోంది. పొరుగు దేశమైన మెక్సికో, ఆర్థిక భాగస్వామి జపాన్వంటి దేశాలూ ఆందోళన ఎన్నికల ప్రచారం నుంచే మెక్సికో మీద ట్రంప్ గురిపెట్టారు. వలసలను నిరోధించేందుకు మెక్సికో సరిహద్దులో గోడ కట్టేస్తానని, దానికయ్యే ఖర్చునూ ఆ దేశం నుంచి వసూలు చేస్తానని, అమెరికాలో అక్రమంగా నివసిస్తున్న కొన్ని లక్షల మంది మెక్సికన్లను తిప్పి పంపించేస్తానని ట్రంప్ పదే పదే ఉద్ఘాటించడం ఇందుకు ప్రధాన కారణం. అంతేకాదు.. మెక్సికో చేసే ఎగుమతుల్లో 80 శాతం వాటా అమెరికాదే. దీంతో ట్రంప్ ప్రభావం దేశంపై ఎలా ఉంటుందన్నఆందోళన మెక్సికోలో నెలకొంది. చైనాపై ట్రంప్ ప్రకటిస్తున్న వ్యతిరేక వైఖరి.. చైనాకు సమీపంలో ఉన్న తనను ఇరుకున పెడుతుందన్న ఆందోళన జపాన్లో నెలకొంది. అమెరికా, చైనా రెండు దేశాలతోనూ జపాన్‌కు కీలకమైన ఆర్థిక సంబంధాలున్నాయి. దక్షిణ చైనా సముద్రంలో చైనా దూకుడును ట్రంప్ తీవ్రంగా వ్యతిరేకించే పక్షంలో ఈ రెండు ఆర్థిక శక్తుల పోరులో తాను చిక్కుకుపోయే పరిస్థితి వస్తుందని కలవరపడుతోంది. యూరప్‌లో అతి ముఖ్యమైన దేశమైన జర్మనీని కూడా ట్రంప్ కలవరపాటుకు గురిచేస్తున్నారు. వాస్తవానికి ఉక్రెయిన్లో జోక్యం చేసుకున్నందుకు రష్యా మీద యూరోపియన్ యూనియన్ ఆంక్షలు విధించేలా యూరప్ దేశాలను ప్రభావితం చేసింది జర్మనీ చాన్సలర్ ఏంజెలా మెర్కెల్. ఇప్పుడు రష్యాతో ట్రంప్ సహితం యూరప్ జర్మనీ ప్రాబల్యాన్ని తగ్గించడంతో పాటు, మెర్కెల్ వ్యతిరేకులను బలోపేతం చేస్తుందన్న ఆందోళన ఆ దేశంలో కనిపిస్తోంది.అమెరికాలో ట్రంప్ గెలుపు ఫ్రాన్స్‌లో రాజకీయ ఆందోళనకు దారితీసింది. త్వరలో జరగనున్న సార్వత్రిక ఎన్నికల్లో ఇక్కడ కూడా మితవాద నేషనల్ ఫ్రంట్ గెలిచే అవకాశం ఉందన్నది ఆ ఆందోళన. ఆ పార్టీ నేత మరైన్లె పెన్‌కు ట్రంప్ బాహాటంగా మద్దతు ప్రకటిస్తే.. ఆమె గెలుపు అవకాశాలు ఊపందుకుంటాయని ప్రత్యర్థులు కలవరపడుతున్నారు. లాత్వియా, ఎస్టోనియా, లిథువేనియా: బాల్టిక్ దేశాలైన ఈ మూడు దేశాలకూ ఇప్పుడు ఆందోళన తీవ్రమైంది. రష్యా జాతీయుల ప్రయోజనం పేరుతో ఉక్రెయిన్ సంక్షోభంలో జోక్యం చేసుకున్న రష్యా.. రష్యా జాతీయులు గణనీయంగా ఉన్న తమ దేశాల్లో కూడా రేవు వేలు పెడుతుందన్న కలవరం లాత్వియా, ఎస్టోనియా, లిథువేనియాలది. సోవియట్ రష్యాకు వ్యతిరేకంగా అమెరికా సారథ్యంలో గల నాటో సైనిక కూటమిలో ఉన్నందున ఇంతకాలం కాస్త ధైర్యంగా ఉన్నాయి. ఇప్పుడు రష్యాతో స్నేహం పెంపొందించుకోవాలని ఒకవైపు, నాటో కూటమికి కాలం చెల్లిందని మరొకవైపు వ్యాఖ్యానిస్తున్న ట్రంప్ తీరు ఈ దేశాల్లో గుబులు రేకెత్తిస్తోంది. దీంతో రష్యా సరిహద్దు వెంట గోడలు కట్టేయాలని లాత్వియా, ఎస్టోనియాలు, కనీసం కంచె అన్నా వేయాలని లిథువేనియా యోచిస్తున్నాయి.

ట్రంప్ లో ఎవరికీ తెలియని కోణాలు అనేకం

అమెరికా అధ్యక్ష ఎన్నికల బరిలో దిగిననాటి నుంచీ డోనాల్డ్ ట్రంప్ పై ఎవరికీ తెలియని కథనాలూ, కథలూ ప్రచారంలోకి వస్తున్నాయి. ఆడవాళ్ళ పట్ల ఆయన ప్రవర్తన బాగుండదనీ, విదేశీయులపై, ముస్లింలపై కక్ష సాధిస్తారనీ.. ఇలా ఏవేవో విమర్శలు ఆయనపై వచ్చాయి. అయితే ఎవరూ ఊహించని విజయం సాధించి అధ్యక్ష పీఠాన్ని అధిరోహించిన తర్వాత ట్రంప్ పై పలు ఆసక్తికరమైన కోణాలూ, కథలూ వినిపిస్తున్నాయి. తాజాగా ఇలాంటిదే ఓ సంఘటన జరిగింది. డోనాల్డ్ ట్రంప్ ఎంతో మంచివారనీ, టాలెంట్ ను గుర్తించటంలో ఆయన ఎప్పుడూ గొప్పవారేననీ చెప్తూ ఒకప్పుడు ట్రంప్ దగ్గర పని చేసిన మాజీ బాక్సర్ విలియమ్ కాంపుడొని షార్ట్ ఫిల్మ్ రూపొందించాడు. ఇప్పటి వరకూ ట్రంప్ గురించి ఎవరికీ తెలియని విషయాలు ప్రస్తావించాడు. ట్రంప్ వల్లనే తాను ఓ విజయవంతమైన బాక్సర్ గా ఎదిగానంటూ విలియమ్ పేర్కొన్నాడు. తాను 22 సంవత్సరాల వయసులో తినటానికి కూడా లేని పరిస్థితుల్లో ఉద్యోగం కోసం ట్రంప్ టవర్ కు వెళ్ళాననీ, ట్రంప్ స్వయంగా తనను కలిసి ఉద్యోగమిచ్చి ఆదుకున్నాడనీ విలియమ్ చెప్పాడు. కొత్త బట్టలు ఇచ్చి మరీ వెల్ కమ్ టు ది ట్రంప్ ఫ్యామిలీ అంటూ ప్రోత్సహించాడన్నారు.



ట్రంప్ విజయం వెనుక తెలుగోడు

రిపబ్లికన్ డాటా ఎనలిస్ట్ గా పనిచేసిన అవినాశ్

డోనాల్డ్ ట్రంప్ విజయం వెనుక ఒక తెలుగువాడి కృషి ఉంది. ట్రంప్ ఎన్నికల ప్రచార బృందంలో ఒకడైన ఆ తెలుగు కుర్రాడి పేరు అవినాష్ ఇరగవరపు. తూర్పుగోదావరి జిల్లా రావులపాలెం మండలం ముమ్మిడివరప్పాడు గ్రామానికి చెందిన ఇరగవరపు పాపారావుకు ఇద్దరు కుమారులు. వారిలో అవినాష్ ఒకరు. లక్నో ఐఐఎంలో ఎంబీఏ పూర్తి చేసిన అవినాశ్ తర్వాత ఇన్‌టెల్‌లో ఉద్యోగం చేస్తూనే భారత్‌లోని రాజకీయ పార్టీలపై ప్రజలకున్న అభిప్రాయాలు గురించి డాటా ఎనాలసిస్ చేస్తుండేవారు. ఈనేపథ్యంలో 2014లో వైసీపీకి వ్యూహకర్తగా వ్యవహరించారు. తదనంతరం అమెరికాలోనే ఆరిజోనా రాష్ట్రంలో ఉద్యోగం చేస్తున్న తన భార్య రంజనను కలుసుకునేందుకు వెళ్లిన సమయంలో ఆరిజోనా గవర్నర్ పదవి కోసం జరుగుతున్న ఎన్నికలను నిశితంగా పరిశీలించారు. డేటా ఎనాలసిస్ట్ కావడంతో గవర్నర్ పదవికి పోటీపడుతున్న జూసీకి గెలుపు వ్యూహాల గురించి ఈ-మెయిల్స్ పంపుతుండేవారు. ఆ ఎన్నికల అనంతరం అవినాష్ మేధాశక్తిని గుర్తించిన రిపబ్లికన్ పార్టీ ట్రంప్ ప్రచార వ్యూహబృందంలో ఆయనకు చోటు కల్పించింది. మొదట్లో రిపబ్లికన్ పార్టీకి డేటా ఎనలిస్ట్ తదనంతరం రాజకీయ పరిశీలకుడిగా విధులు నిర్వహించేవారు. అవినాష్ పదునైన వ్యూహాలను గుర్తించడంతో ఆరిజోనా రాష్ట్రం రిపబ్లికన్ పార్టీకి ఈడీగా నియమించారు.

అమెరికా ఉపాధ్యక్షుడికి మన నల్లగొండ దోస్తు

డోనాల్డ్ ట్రంప్ పరిపాలనా కాలంలో భారతదేశానికి అమెరికాకు మధ్య సంబంధాలు మరింత పెరుగుతాయని ట్రంప్ పరిపాలన వర్గం భారత్‌కు అత్యధిక ప్రాధాన్యం ఇవ్వనుందని తెలుస్తోంది. ప్రస్తుతం అమెరికాకు ఉపాధ్యక్షుడిగా బాధ్యతలు చేపడుతున్న మైక్ పెన్స్‌కు అత్యంత సన్నిహితుడు రాజు చింతల. తెలంగాణ రాష్ట్రం నల్లగొండ జిల్లాకు చెందిన రాజు చింతల గత పదేళ్లుగా మైక్ పెన్స్‌కు అత్యంత సన్నిహితుడిగా ఉన్నాడు. అమెరికా హౌస్ ఆఫ్ రిప్రజెంటేటివ్స్‌లో సభ్యుడిగా ఉన్నప్పటి నుంచి ఇండియానా గవర్నర్‌గా మైక్ పెన్స్ అవతరించేవరకు కూడా రాజు చింతల పెన్స్‌తో సంబంధాలు కలిగి ఉన్నారు. ప్రస్తుతం ఆయన ఇండియానా నుంచి వాషింగ్టన్‌లో దిగారు. వాషింగ్టన్‌లో కొలువు దీరనున్న కొత్త అమెరికా ప్రభుత్వ ప్రమాణ స్వీకారంలో రాజు చింతల పాల్గొంటున్నారు. ఈ సందర్భంగా ఆయన దక్షిణాసియా దేశాల్లో అమెరికా తరువున కీలక పాత్ర ఒక్క భారత్ మాత్రమే పోషించగలదని అమెరికా భావిస్తోంది.



# వింతలు- విడ్డూరాలు

✦ ప్రపంచంలో మొత్తం ఉత్పత్తయ్యే ధనియాలలో

**మూడింట రెండు వంతులు**

ఇటలీలోని ఒక్క కొండలోయ ప్రాంతంలోనే పండుతాయి!





Cotton Candy - పీచుమిఠాయి

ప్రపంచంలో అత్యధిక పోస్టాఫీసుల్ని కలిగి ఉన్నది మనదేశమే.





మన శరీరంలో ఒక్క కార్నియాకే రక్త ప్రసరణ జరుగదు. ఇది గాలి నుంచి నేరుగా ఆక్సిజన్‌ను తీసుకుంటుంది.




* 90 -- భారతదేశం నుంచి సాఫ్ట్‌వేర్ సేవలను పొందుతున్న దేశాలు

రత్నాల తూకానికి వాడే **'కారెట్'** అనే పదం 'కారొబ్' అనే చెట్టు నుంచి వచ్చింది. మధ్యధరా ప్రాంతంలో పెరిగే ఈ చెట్టు విత్తనాలను ప్రాచీన కాలంలో జాతి రత్నాల బరువుకు ప్రామాణికంగా తీసుకునేవారు!



ప్రపంచంలో నీటి తరవాత అత్యధికంగా ఉపయోగించే పదార్థం కాంక్రీటు.





పత్రిక చదవడంతో పోలిస్తే కంప్యూటర్‌పై చదవడం 25 శాతం నెమ్మదిగా సాగుతుంది!








ఆవు నెమరు వేసేటప్పుడు రోజుకి సుమారు 40,000 సార్లు దవడలను కదుపుతుంది.



Crocadile - మొసలి

మొసలి నేలమీద నేరుగా మాత్రమే వేగంగా పాకగలదు . అది పక్కలకు అంత సులభముగా తిరగలేదు . మొసలి వెంటబడిన సందర్భాలలో జిగ్ జాగ్ గా పరుగెత్తితే దానినుంచి చాలా సులువుగా తప్పించుకోవచ్చు .



న్యాయాన్ని, ధర్మాన్ని, సుఖ సంతోషాలను ఆఖరికి మనిషిలోని దైవత్వాన్ని కూడా యుద్ధం చంపివేస్తుంది. -చార్లెస్ మైనర్

కథ

# ప్రేమకానుక!

## హుమాయున్ సంఘీర్



మడతలు పడ్డ చర్మం, మసక బారిన కళ్ళకి కళ్ళజోళ్ళు, భర్త చనిపోయిన స్త్రీ అని అందులోనూ ఆమె వృద్ధాప్యఛాయల్లో వుండి నీరసంగా వున్నట్టు చెప్పకనే తెలిసిపోతుంది. జీవితంలోని వివిధ కోణాలని చాలా దగ్గరగా, తీక్షణంగా చూసిన అనుభవం ఆమె రూపాన్ని చూస్తే ప్రస్ఫుటంగా తెలిసిపోతుంది.

ఆమె ప్రక్కనే ఓ ఆరడుగుల అందగాడు ఉన్నాడు. పోలికలు... చూస్తూ ఆమె కొడుకే అనుకుంటారు. పెళ్ళైన చాలా యేళ్ళకి కలిగిన ఏకైక కొడుకతను. 'కొడుక్కి ఇంజనీరింగ్‌లో సీటొస్తే ఆ ఏడుకొండలవాడి దర్శనం చేస్కుంటానని' ముడుపు కట్టింది సీతమ్మ. ఆమె కోరిక నెరవేరింది. కొడుక్కి మంచి పేరున్న ఇంజనీరింగ్ కాలేజీలో సీటు దొరికింది. తడవే... ఇక తిరుపతికెళ్దామని బయలుదేరారు తల్లికొడుకులు.

బస్సుకోసం చాలా సేపట్నించి మహాత్మాగాంధీ బస్టాండ్‌లో వేచియున్నారు. అక్కడ కుర్చీలో కూర్చొని జపమాల తీసి రామానామజపం చేస్తోంది సీతమ్మ.

"అమ్మా... ఇప్పుడే వస్తాను..." అని చెప్పి, బ్యాగుల్ని సీతమ్మకి దగ్గరగా జరిపి, ప్రక్కనే వున్న బుక్‌స్టాల్ వైపు నడిచాడు ప్రేమ్. సీతమ్మ ధ్యానంలో వుండిపోయింది. వివిధ ప్రదేశాలకు వెళ్ళే బస్సుల రాకపోకల గురించి ప్లాట్‌ఫాం నెంబరుతో సహా మైకుల్లో ఎనౌన్స్‌మెంటు మూడు భాషల్లో కొనసాగుతోంది. ప్రయాణీకులతో బస్టాండ్ ఆవరణం అంతా... కిక్కిరిసిపోయివుంది. బస్సుల కోసం పరుగులతో ఎవరి హడావిడిలో వారున్నారు.

స్వీపర్లు వచ్చి చెత్తకాగితాల్ని ఏరేస్తూ పరిసరాల్ని శుభ్రంగా ఊడుస్తున్నారు.

ఈ మధ్య నగరానికి బాంబుల బెడద ముసురుకుంది. "అనుమానితులపట్ల, అనుమానాస్పద వస్తువుల పట్ల జాగ్రత్తగా వుంటూ, పోలీసులకి సహకరించవలసిందిగా..." మరో అనౌన్స్‌మెంటు కూడా మూడు భాషల్లో కొనసాగుతోంది.

సీతమ్మ ఈ ప్రపంచంతో పనిలేనట్టు తనదైన అద్వైత ప్రపంచంలో వుండిపోయింది.

కాసేపటికి బ్యాగులోంచి మంచి నీళ్ళబాటిల్ తీసి గట... గటా గొంతు తడుపుకుంది.

ఆమెకెదురుగా ధవళ వస్త్రాల్లో వున్న ఓ నడివయసు పెద్దాయన తనవైపే చూడటం గమనించింది సీతమ్మ.

సీతమ్మ కూడా అతనివైపు కాసేపు పరీక్షగా చూసింది. తెల్లని మెలితిరిగిన మీసాలు, తెల్ల జనుములా తల్లో వెంట్రుకలు, చేతిలో కర్ర, కళ్ళజోడు, లాల్చీ, ధోవతిలో మునసబులా వున్నాడు. అతనివైపు కన్నార్పకుండా చూస్తుండిపోయింది సీతమ్మ. ఆమె అంతరంలోంచి సర్రున ఏదో పాకినట్లైంది. గత జ్ఞాపకాల దొంతరల తలుపులు తెరుచుకున్నాయి. ఏదో పోగొట్టుకున్న వస్తువు చాలా రోజులకి దొరికినట్టు అనిపించి ఒక్కసారిగా నీరసాన్ని వీడి గబుక్కున లేచి... నిల్చుంది. కానీ... ఆమె చూపులు మాత్రం ఆ పెద్దాయన మీదే ధృఢంగా కేంద్రీకృతమైవున్నాయి. "అతను తనకి బాగా దగ్గరి మనిషేకదా... అనుకొని లోలోన చాలా సేపటిదాకా అవస్థపడింది.

అదే అవస్థలో ఆ పెద్దాయన కూడా వున్నాడు."ఖచ్చితంగా ఆయన రామరాజే" అనే ధీమాకొచ్చింది. ఆయన ఆమెని పోల్చుకొని తనని సమీపిస్తున్న కొద్దీ సీతమ్మలో అదోరకమైన అలజడి మొదలైంది. చేతిలో వున్న జపమాలను బొడ్లో చెక్కుకుంది. సన్నగా ఆమె ముఖంలో సంతోషం అలుముకోసాగింది. "బాగున్నావా సీతా... ఎన్నాళ్ళయింది నిన్ను చూసి... దగ్గరగా వచ్చి, ఆమెకెదురుగా నిల్చుని అడిగాడా పెద్దమనిషి.

ఆ మాట వినగానే ఆమెలో ఉద్విగ్నత చోటు చేసుకుంది. ఎన్నాళ్ళయింది ఆ పిలుపుకి దూరమై 'సీతా'... అని ఎంతో మార్ధవంగా పలికే ఆ గంభీర్యమైన గొంతు మాట తన చెవుల్లో మారుమ్రోగాక, మనసు వీణ మీటేవారు లేక మూగబోయి వుంది. చాలాకాలం తర్వాత ఆ పిలుపు విన్న సీతమ్మ ఆనందం అవధులు చెరిపేసుకుంటోంది. కాసేపటిదాకా 'ఇది కలా నిజమా?' అనే సందిగ్ధంలో పడింది. ఆయన మళ్ళీ 'సీతా' అనేవరకు ఈ ప్రపంచంలోకి రాలేకపోయింది సీతమ్మ. "మీరేనా?" అంది ఆయన కళ్ళల్లోకి చూస్తూ... "నేనే రామరాజుని చాలా సేపట్నించి నిన్ను... చూస్తున్నాను పోల్చుకోవడానికి టైం పట్టిందంతే. కాలం ఎంత కసిగా మన మీద పగ తీర్చుకుందో కదూ?" అంటున్న ఆయన ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఆమె ముక్కు పుటాలని పరిమళాలుగా తాకుతున్నాయి.

చిన్నగా సిగ్గుతో కూడుకున్న నవ్వు నవ్వింది. ఆ వెంటనే అగ్నిపర్వతం బద్దలైనట్టు ముఖం మాడ్చుకుంది.

అటూ... ఇటూ... చూసింది. ప్రేమ్ బుక్‌స్టాల్లో ఏవో పుస్తకాలు చూస్తూ... ఫోన్‌లో ఎవరితోనో మాట్లాడుతున్నాడు. తలతిప్పి ఆయన్ని మురిపెంగా చూస్తూ... "మీరెలా వున్నారూ? అంతా కులాసేనా? ఇది మనమధ్య విధి నిర్వహించిన విరామానికి ఈ కలయిక ముగింపా, కొనసాగింపా?" అంది ఉద్వేగాన్ని అనుచుకుంటూ...

"ప్రపంచంలో ఏ మనిషైనా ప్రేమని ద్వేషిస్తాడెందుకో... ద్వేషాన్ని ప్రేమిస్తాడెందుకో అర్థంకాదు!? ప్రేమించడం నేరమైతే ప్రపంచంలో శాంతికి చోటే లేదు. మనం మన ప్రేమలో ఓడిపోయాం. ఈ మనుషులకి 'మనీ' విలువ తప్ప 'మనసు' విలువ తెలియనంతకాలం 'ప్రేమ'కి చోటు లేదు ఈ విశ్వంలో? పెద్దరికపు వంచనలో నలిగిపోయాం, మానసికంగా చితికిపోయాం, మొండి పట్టుదల వీడని వారి పెద్దరికాలు మనకే మాత్రం భాగ్యం మిగిల్చాయి. చిటికెడు కుంకుమకి నువ్వు దూరమయ్యావు. కళికైడైనా దాంపత్య జీవనానికి నేను నోచుకోలేకపోయాను. జీవితాంతం ఇద్దరికీ కన్నీళ్ళే మిగిలాయి" అంటున్న రామరాజు హృదయం బరువెక్కింది. ఇద్దరి ముందూ గతమంతా సాదృశ్యమవసాగింది. కారిన్యం నింపుకున్న హృదయాలు ప్రేమామృత మనుషులకి ముక్కలుగా నరికి చూపాయి. భౌతికంగా మిగిలారు తప్ప మానసికంగా వాళ్ళిప్పుడో చచ్చిపోయారు!? చిప్పిల్లాయి ఇద్దరి కళ్ళు. కళ్ళద్దాలు తీసి కర్చీఫ్‌తో కళ్ళు తుడుచుకున్నాడు రామరాజు. ఆమె కొంగుతో ఒత్తుకుంది. వారి హృదయాల్లో జ్ఞాపకాల కావ్యం ఆవేదననిదేవుతోంది. "ఏం చేస్తామండీ... పైవాడికే ప్రేమంటే గిట్టదు కాబోలు. అందుకే ప్రతినాయకులు చేత ప్రేమికుల్ని పీడించి చంపుతాడు. అంతా దైవలీల. శివుడి ఆజ్ఞ లేనిది చీమ కరువదు..అలాగే... ఈ ప్రేమ యుద్ధాలూ దైవసంకల్పితమే అనుకుంటాన్నేను. రాజీపడటం అలావాటయ్యాక ఎలాంటి ఉపద్రవాన్నైనా ఎదుర్కొనే స్థైర్యం వచ్చేస్తుంది. మనిషిని పావులా వాడుకోవడం, బానిసలా చూడటం భగవంతుడికి చాలా ఇష్టం కాబోలు. అయినా... ఆయన స్మార్థం కోసం... నేనే నిత్యం ఆయన నామజపం చేస్తాను... మన విషయంలో దేవుడు చేసింది 'తప్ప'ని ఆయన్ని నిందించలేను 'ఒప్పు' అని సమర్థించలేను." అంటున్న సీతమ్మ కళ్ళు వర్షిస్తున్నాయి. కొంగుతో ముఖం ఒత్తుకొని వెక్కసాగింది కాసేపటిదాకా...

"సీతా' నీకు నేను నిజం చెప్పాలి. చాలా రోజుల్నుంచి నీ అడ్రస్ కోసం వెదుకుతున్నాను. ఈ నిజం నాకొక్కడికే కా కుండా నీక్కూడా తెలిస్తే బావుంటుందని నీ కోసం చాలా చో ట్ల వెదికాను... ఇదిలో... ఆ భగవంతుడి దయవల్ల కన్పించావ్. ఇప్పుడు నాకు చాలా రిలాక్స్‌డ్‌గా వుందనుకో. నిజం నీకు చెప్పేస్తే నా గుండె మీదినుండి పెద్ద బరువు దిగిపోతుం దనుకో..." అంటున్న అతని మాటలు వింటున్న సీతమ్మ భృకుటి ముడిపడింది!? రామరాజు మాటలు అర్థంకాక తొట్రుపాటులో పడింది? మళ్ళీ రామరాజే కల్పించుకుంటూ "నువ్వు సరిగ్గా ఇరవైయేళ్ళ క్రితం రంగారెడ్డి జిల్లా ప్రసూతి ఆస్పత్రిలో పండంటి ఆడపిల్లకి జన్మనిచ్చావ్..." అంటూ ఆగిపోయాడు రామరాజు. బుక్‌స్టాల్ వైపు చూసింది. ప్రేమ్ ఇంకా ఫోన్‌లోనే మాట్లాడుతున్నాడు. ఆమెకేం అర్థంకాక రామరాజుని చూస్తూ బిత్తరపోయింది!?

"నువ్వేం కంగారు పడాల్సిన విషయమేమీ లేదు సీతా... సరిగ్గా అదే టైంలో నాభార్య కూడా అదే హాస్పిటల్లో మగబిడ్డకి జన్మనిచ్చి తనువు చాలించింది. నాకిలా ఎందుకు చేయాలన్పించిందో చెప్పలేను. విషాదప్రవాహంలో కొట్టుకుపోతున్న నాకు నీ కూతురు గొప్ప ఓదార్పు అనుకున్నాను. అంతే... రాత్రి ఒంటిగంట అప్పుడు నా బిడ్డని నీ ప్రక్కలో పడుకోబెట్టి నీబిడ్డని ఎత్తుకొచ్చుకున్నాను. తనలో నిన్ను చూసుకుంటూ నీ బిడ్డని నా బిడ్డగా నా బిడ్డని నీ బిడ్డగా పెంచుకున్నాం. నువ్విచ్చిన మహాప్రేమకానుకొని నా చిట్టితల్లిని అల్లారుముద్దుగా సాకాను. నీ దగ్గర కూడా నా బిడ్డ మహారాజులా పెరుగుతాడనుకున్నా... అది నిజమైంది. కొన్నాళ్ళకి ఈ విషయం నీతో చెప్పాలనుకున్నా...కానీ మీ రు ట్రాన్స్‌ఫర్ అయి చెన్నై వెళ్ళారని తెలిసింది. అక్కడికీ అడ్రస్ కోసం చాలా ట్రై చేసాను. కానీ... అడ్రస్ ఎంతకీ దొ రకలేకపోయింది. ఇన్నాళ్ళకైనా నీకు నిజం చెప్పాననే తృప్తి మిగిలింది. సీతా... నేను చేసింది తప్పంటావా? తప్పైతే నన్ను క్షమించు... " అని సీతమ్మ చేతుల్ని పట్టుకొని తన నుదురుకి ఆన్చుకొని పొగిలి ఏడ్చేస్తున్నాడు రామరాజు.

ఆయన కన్నీళ్ళు ఆమె మడమల్ని తడిపేసాయి. అంతా విన్న సీతమ్మ బొమ్మలా బిగగదీసుకుపోయింది. అప్రయత్నంగానే కన్నీళ్ళు నేలతడుపుతున్నా యి. అతనికేం సమాధానం చెప్పాలో తోచటం లేదామెకి. ప్రేమ్ వైపు మళ్ళీ చూసింది. కాసేపటికి ఆమె చేతులు వదిలి కాస్త దూరంగా నిల్చున్నాడు రామరాజు. అప్పుడే ప్రక్కనుండి... "నాన్నా...మన బస్సొచ్చింది పదా..." అంటూ వచ్చి బ్యాగు అందుకుంది సిరి. మేనిఛాయతో మిలమిలా మెరిసిపోతోంది సిరి. "నమస్తే... ఆంటీ..." అంటూ గౌరవవందనం చేసింది సిరి. రామరాజు తన కళ్ళతో 'తనే నీబిడ్డ' అన్నట్టు సంజ్ఞ చేసాడు.

యవ్వనంలో తనున్నట్టుగానే వుంది సిరి. సీతమ్మ ఎదురుగా నిల్చున్న తన ప్రతిరూపాన్ని కన్నార్పకుండా చూస్తుండిపోయింది. అప్పుడే ఓ వీక్లీ చేతపట్టుకొని ఇటువైపునుండి ప్రేమ్ వచ్చాడు. బస్సు ప్లాట్‌ఫాం మీదికొచ్చిందనే హడావిడిలో బ్యాగు చంకనేసుకుంటూ "అమ్మా... పదా... మన బస్సొచ్చింది అంటూ రామరాజు వైపు చూసాడు. రామరాజు యవ్వనంలో ఉన్నట్టే ఉన్నాడు ప్రేమ్ కూడా. కొడుకు వైపు రెప్పవాల్చకుండా అలా చూస్తుండిపోయాడు కాసేపటిదాకా...

"ప్రేమ్ ఈయన మన దూరపుబంధువు రామరాజు అంకుల్. తను వాళ్ళమ్మాయి సిరి" అని పరిచయం చేసింది సీతమ్మ. "నమస్కారం అంకుల్. హాయ్ సిరి" అంటూ కదులుతున్న అతనివైపు చూస్తూ మైమర్చిపోసాగాడు రామరాజు. సీతమ్మ కూడా సిరి మీదనుండి తన దృష్టిని మరల్చుకోలేకపోతోంది. రామరాజు వైపు కృతజ్ఞతాపూర్వకంగా చూ సింది. సీతమ్మ రామరాజు వైరక్తికంగా నవ్వాడు. ఆయన నవ్వుల్లో జీవంలేదు. జీవితంలో రంగుల్లేవు! జీవన కదనరంగంలో పోరాడి... పోరాడి గెలిచి ఓడి... ఓడి... పడిపోయినట్టుగా నిరాసక్తంగా వుంది ఆయన నిలువుదృశ్యం?? అంటే... మన ప్రేమకానుకలుగా మీ ప్రతిరూపం నా దగ్గర, నా ప్రతిరూపం మీ దగ్గర ఉన్నారన్న విషయం మర్చిపోయి బతికాన్నేను. ఇంత గొప్ప కానుకిచ్చిన మీ ఋణం వచ్చే జన్మలో తప్పకుండా తీర్చుకుంటాను. 'ప్రేమకి ఓటమి ముగింపు కాదు గెలుపు కొనసాగింపు కావాలి' మనసులో అనుకొని నిట్టూర్పు శ్వాస వదుల్తూ ఉత్తరం వైపు కదిలింది సీతమ్మ. 'మళ్ళీ జన్మంటూ వుంటే కలిసి జీవితాన్ని పంచుకుందాం. అంతవరకు ఈ జన్మకి ఈ ప్రేమకానుకలే మనకు ప్రాణవాయువులు' అనుకొని దక్షిణం వైపు కదిలాడు రామరాజు. కొద్దిదూరం వెళ్ళాక వెనక్కి మరలిచూసింది సీతమ్మ. రామరాజు కూడా చూసాడు. 'అదే కడచూపు!' అన్నట్టు ఇద్దరూ ఒకేసారి ముఖాలు త్రిప్పుకొని, బస్సులవైపు నడిచారు కదుభారంగా, తనదైన ప్రపంచంలోవున్న ప్రేమ్‌ని చూసాడు మళ్ళీ... దూరంగా మూల మరలుతున్నాడు. సిరిని కూడా చూడాలనే అవస్థలో మరిలిచూసింది సీతమ్మ. కానీ... ఎవరికెవరు కానరాకుండా కనుమరుగైపోయారు. ●

## గుటకాయ...

"డాక్టర్! మా ఇంట్లోకి వెళ్ళాలంటే కుదరడం లేదు. ఆటోమేటిక్ డోర్ లాకైపోయింది. మీరు త్వరగా రావాలి..!" అన్నాడు వినోద్ హడావుడిగా.

"దానికి ఏ కార్పెంటర్నో పిలవాలి గానీ నాకు ఫోన్ చేస్తే ఎలా..?" అడిగాడు డాక్టర్.

"మేం అంతా సరదాగా బైటికెళ్ళాం. మా వాడిని ఒంటరిగా ఇంట్లోనే వదిలేసి వెళ్ళాం. తాళం చెవిని మింగేశాడు. సార్..!" అసలు విషయం చెప్పాడు వినోద్.



ప్రతిభ, ప్రావీణ్యం, మేధస్సు అనేవి ఎప్పటికయినా బయటపడితీరుతాయి. -సిమర్స్

# సూర్య బుడత




## ఒక్కొక్కదానికి ఖర్చు ఎంత?

రామయ్య రూ 4,25,320 ఇల్లు కట్టాడు. ఇంటి స్థలం ఖరీదు ఆ ఇంటి కైనా మొత్తం ఖర్చులో 43% సమానం. కరెంటు కి ఖర్చు ఇంటి కైనా మొత్తం ఖర్చులో 18%, నల్లాలకు ఖర్చు ఇంటి కైనా మొత్తం ఖర్చులో 9% మిగిలిన 30% ఇంటి కట్టుబడి కి ఖర్చు. అయితే స్థలం ఖరీదు, కరెంటుకి, నల్లాలకి, మరియు ఇంటి కట్టుబడి కి ఖర్చు ఎంత?

జవాబు: స్థలం ఖరీదు రూ. 182887.60, కరెంటు కి రూ. 76557.60,
నల్లాలకు రూ. 38278.80, ఇంటి కట్టుబడికి రూ. 127596.00

చామర్తి వెంకట రామ కృష్ణ
1-9-714 /-201
అడిక్మెట్, హైదరాబాద్ 500044



## దారిని చూపండి



## గిలిగింతలు పెడితే నవ్వెందుకు వస్తుంది?

మన శరీరంలో ఎన్నో అవయవాలు, అవ యవ భాగాలు ఉన్నా, అందులో కొన్ని చాలా సున్నితమైనవి వుంటాయి. ఆ భాగాల్లో ప్రాణప్రదమైనవి, జీవానికి చాలా విశిష్టమైన అంతర్భాగాలు ఉంటాయి. ఉదాహరణకు చంకల కింది భాగంలో ఉన్న ఉరఃపంజరం (Chest) చాలా ముఖ్యమైనది. ఎందుకంటే అందులోనే జీవానికి అతి ముఖ్యమైన ఊపిరితిత్తులు, గుండె లాంటి భాగాలు ఉంటాయి. అలాగే మెడ భాగంలో మెదడుకు, శరీ రానికి అనుసంధానమైన నాడులు, రక్తనాళాలు, శ్వాస నాళం, ఆహార వాహికలాంటి కీలక భాగాలు ఉంటాయి. ఇలాంటి ముఖ్యమైన అవయవాలుండే భాగాల్లో బయట నుంచి ఎలాంటి స్పర్శ, లేదా వత్తిడి కలిగినా దానికి వెంటనే స్పందించి, నిరోధించే వ్యవస్థ శరీరంలో ఉంటుంది. ఆయా భాగాల్లో నాడీతంత్రులు బాగా విస్తారంగా ఉంటాయి. అందువల్లనే ఇతరులు ముట్టుకోగానే కితకితల రూ పంలో మెదడుకు సందే శాలు అందుతాయి. ఆ స్పర్శ, ఒత్తిడులను నివారిం చేందుకు మెదడు మన శరీరాన్ని పురికొల్పుతుంది. అందువల్లనే మనం చటు క్కున నవ్వుతూ తప్పించు కోడానికి ప్రయత్నిస్తాం.

## తేడాలు గుర్తించండి



## రంగులు వేయండి





జీవితం బరువు బాధ్యతలను ఆనందంతో వహించడం నేర్చుకోవాలి. -శ్రీమద్భాగవతం

వాత్సాయన

# బీర్జాల ప్రాముఖ్యత

పురుషాంగం వెనుక, తొడల మధ్య వేలాడుతూ కనిపిస్తాయి బీర్జాలు. స్రోటం అనబడే చర్మపు సంచిలో ఇవి అమరి వుంటాయి. ఇవి స్త్రీల ప్రత్యుత్పత్తి వ్యవస్థలో అండాశయాలు వంటివి. వీటిల్లోనే వీర్యం తయారవుతుంది. తయారయిన వీర్యం వాస్ డిఫెరాన్ అనే నాళం ద్వారా పురుషాంగానికి చేరుకుంటుంది. లైంగికోద్రేకం ఏర్పడినపుడు అంగం గట్టిపడి మైథునానికి పురిగొల్పుతుంది. మైథున సమయంలో కామోద్రిక్తత, ఉత్కంఠ మరింత తారాస్థాయికి చేరుకోవడం జరిగి, అప్పటికే పురుషాంగంలోకి చేరుకున్న వీర్యం స్త్రీ యోనిలోకి చిమ్మబడుతుంది.

హస్తప్రయోగం చేసుకునేటపుడు కూడా ఇదే విధంగా జరుగుతుంది. కొద్దిపాటి లైంగికాలోచనలు ఏర్పడగానే పురుషాంగంలోకి వీర్యం చేరుకోవడం జరుగుతుంది. అలా చేరుకున్న వీర్యం, పూర్వరతి సమయంలో స్రవించే ద్రవంతో బాటూ స్వల్ప మోతాదులో బయటకు విడుదల కావటం జరుగుతుంది. అందుచేతనే పూర్తిగా అంగప్రవేశం చేయకపోయినా, జననేంద్రియాల వద్ద ఏర్పడిన తడి లేదా స్ఖలనం వల్ల కూడా గర్భం వచ్చే అవకాశాలు వుంటాయి. పునరుత్పత్తికి అవసరమయ్యే వీర్యాన్ని తయారు చేసే బీర్జాలు, ఒకటి చిన్నదిగాను, మరొకటి పెద్దదిగాను వుంటుంది. అలాగే ఒకటి మరొకదానికన్నా కాస్త ఎక్కువ కిందికి వేలాడుతూ వుంటుంది. కొన్ని సందర్భాలలో ఒక బీర్జం కన్పించకపోవచ్చుకూడా. శరీరపు ఉష్ణోగ్రతను బట్టి ఇవి కిందికి వేలాడడం ఆధారపడి వుంటుంది. ఎక్కువ ఉష్ణోగ్రత వున్నపుడు, బీర్జాలలో ఉష్ణోగ్రత కూడా ఎక్కువ కాకుండా వుండడం కోసం ప్రకృతి సహజంగా, బీర్జాలు కిందికి వేలాడడమనే అలవాటును కలిగివుంటాయి. బీర్జాలలో తయారయ్యే వీర్యంలోని జీవకణాలు సజీవంగా వుండడానికి ఈ ఏర్పాటు ఎంతగానో తోడ్పడుతుంది. కాగా మైథున సమయంలో బీర్జాలు, ఎప్పటిలా కాక కొంచెం పైకి చేరుకున్నట్టుగా కన్పిస్తాయి. ఇది లైంగికంగా ఉద్రిక్తమవడాన్ని సూచిస్తుంది. బీర్జాలకు దెబ్బ తగిలినపుడు వాపు ఏర్పడ్తుంది. ఒక్కోసారి బీర్జాలలో నీరు చేరుతుంది. దీనిని హైడ్రోజిల్ అంటారు. ఇతరత్రా ఏర్పడే శారీరక ఇబ్బందులలో హెర్నియా ఒకటి. బీర్జాల నివాసమయిన స్రోటం లోకి ఇతర కండర సముదాయం వచ్చి చేరడం. ఇది చాలా ప్రమాదకరం. ఇందుకు శస్త్రచికిత్స ఒకటే మార్గం!

మీ పురుషాంగం పరిమాణం ఎంత వుందో, మీ ఉత్తరంలో రాయలేదు. రతి చేయడానికి, స్త్రీని సంతృప్త పరచడానికి, స్తంభించిన అంగం రెండున్నర అంగుళాలు వుంటే చాలు. మీ భార్య నిరాశకు లోనుకావడానికి రెండు కారణాలు వుండవచ్చు. అందులో మొదటిది, రతి సరిగ్గా చేయకపోవడం. అందుకు మీ అంగం చిన్నదికావడం కారణం కా దు. త్వరగా వీర్యాన్ని స్ఖలించడం, పూర్వరతి తగి నంతగా చేయకపోవడం, సరైన భంగిమను ఎంచు కోక పోవడం..వంటి అనేక కారణాలవల్ల ఆమె తృప్తి చెందక పోయుండవచ్చు. రెండోకార ణం, ఆమె వైఖరి. కొంతమంది స్త్రీలల్లో పొడ వయిన పురుషాంగం కనిపిస్తే కాని తృప్తి అనిపించదు. మీ విషయంలో రతిని సరి గ్గా చేయకపోవడం కారణమయినట్లయి తే, అందుకు తగిన పరిష్కార మార్గాల ను ఎంచుకోండి. శీఘ్రస్ఖలనాన్ని అరిక ట్టేందుకు అనేక వ్యాయామాలు వున్నా యి. అలాగే పూర్వ రతిని మరింత రసభ రితంగా కొనసాగించేందుకు కూడా మా ర్గాలున్నాయి. ఆమె వైఖరిలో లోపం కారణ మయినట్లయితే, మీరు ఆమెను కౌన్సిలింగ్‌కు తీసుకువెళ్లండి. ఆమెలో లైంగికభావనలు చోటుచేసు కున్న తొలిరోజుల్లో ఏర్పడిన అభిప్రాయాల మూ లంగా పొడవయిన పురుషాంగం వల్లనే భావ ప్రాప్తి కలుగుతుందనే దురాభిప్రాయం చో టు చేసుకుని వుండవచ్చు. ఈ దురాభిప్రా యాన్ని కౌన్సిలింగ్ ద్వారా పోగొట్టవచ్చు.

ఈ రకమయిన భావావేశాలకులోను కావడాన్ని సైకాలజీ లో 'ఫెటిషిజం' అంటారు. స్త్రీలకు చెందిన వస్తువులతో లైం గికానందాన్ని పొందడం దీని లక్షణం. స్త్రీలు ఉపయోగించే ఉంగరం, మెడలో గొలుసు, చివరకు వారు వాడి వదిలిన ప్యాంటీలు వంటివి సేకరించి, లైంగికానందాన్ని పొందు తుంటారు. వాటిని చూడగానే ఈ అలవాటు వున్న వారిలో కామోద్రేకం కలుగుతుంది. ఆ మానసికస్థితి ఇంకా ఎక్కువ కాకమునుపే మీరు సెక్సాలజిస్టుని కలిస్తే మంచిది.

---

లక్కీ నంబర్

# అనుకున్న పనుల్లో ఆటంకం

నా పేరు ఎమ్. మహేష్. డేట్ ఆఫ్ బర్త్ 8-5-1988. చదువులో ఏకాగ్రతలేదు. చదువుసాగడంలేదు. ఏదీ కూడా కలిసిరావడంలేదు. నాకు సరైన మార్గం చూపించండి.

**మహేష్, హైదరాబాద్**

మహేష్ అనే పేరులో 6, 3 అనే సంఖ్యలు ఉన్నాయి. అందువలన జీవితం ఆరు మూడు అవుతున్నది. అంటే రెండూ కూడా విధ్వంసం నంబర్లే. మీ పేరులో మహేష్‌కు ముందు ఎమ్ అనే ఇనీషియల్‌ను చేరిస్తే 31వ నంబర్ వస్తుంది. దీనిని డెత్ నంబర్ అని అంటారు. అందుకని మీరు మీ పేరును ఇక నుండి **MAAHESH** గా మార్చుకుని వాడుకోండి. ఈ పేరులో అత్యంత ప్రభావం గల 24 నంబర్ చేర్చడం జరిగింది. దీనికి జతగా ఇంటిపేరులోని ఇనీషియల్ ఎమ్ కూడా పేరుకుముందు వాడుకోవచ్చు. దాని వలన 28వ నంబర్ వస్తుంది. 6,7 మీ అదృష్ట సంఖ్యలు. ఇలా మార్చుకుంటే మీరు కోరుకున్న విజయాలు మీ తలుపు తడతాయి. ఉన్నత విద్యావంతులు కాగలరు.

★★★

నా పేరు మోకిలి రాజు. పుట్టిన తేదీ 8-1-1975. నేను ఎంతగా కష్టపడినా సరైన ఫలితం ఉండటంలేదు. నా మానసిక ఆరోగ్యం సరిగాలేదు. అన్నీ సమస్యలే. నాకు దయచేసి ఏదైనా మార్గం చూపించగలరు.

**మోకిలి రాజు హుజూరాబాద్**

మోకిలి రాజు అనే పేరులో బ్లాస్టింగ్ నంబర్ ఉంది. అది వ్యతిరేక ప్రభావం చూపే సంఖ్య. సంఖ్యాశాస్త్రం ప్రకారం దాని ఫలితం చాలా తీవ్రంగా ఉంటుంది. మీరు మీ పేరు **MOKILLE RAZU** గా 41 రోజులు 41 సార్లు 5 కోర్సులుగా రాసుకోండి. 2,5 మీ అదృష్ట సంఖ్యలు. ఇక నుండి మీరు ఎక్కడ రాసినా ఇలానే రాసుకోండి. మీ జీవితం అంతా అదృష్టదాయకంగా సాగుతుంది. మీ మానసిక అనారోగ్యం కూడా కుదటపడుతుంది. ఆర్థికంగా నిలదొక్కుకుంటారు.

★★★

నా పుట్టిన తేదీ 4-3-1975. నా పేరు సతీష్. చేస్తున్న ఉద్యోగంలో ఎదుగుదల లేదు. అన్నీ కూడా రివర్స్‌గా జరుగుతున్నాయి. అనుకున్నది ఒకటి అయింది మరొకటి అన్నట్టుగా ఉంది. ఏ పనీ కూడా సవ్యంగా సాగడంలేదు. అన్నీ సమస్యల మయం. సరైన మార్గం చూపించండి.

**సతీష్, నిజామాబాద్**

సతీష్ అనే మీ పేరులో రివర్స్ నంబర్ 12 ఉంది. అందువలనే మీకు అలా జరుగుతోంది. ఇక నుండి మీ పేరును **SATTISH** అని 21 సార్లు 10 కోర్సులుగా రాసుకోండి. 3,7 మీ లక్కీనంబర్లు. ఇలాచేస్తే మీ జీవితం అంతా సుఖమయంగా సాగుతుంది. మీరు అనుకున్న పనులు...మీ ధ్యేయం నెరవేరుతాయి. కష్టాలన్నీ కడతేరుతాయి. జీవితంలో రెండవ అధ్యాయాన్ని చవిచూస్తారు.

★★★

నేను మహబూబ్‌నగర్‌లో స్టేట్ గవర్నమెంట్ ఉద్యోగిగా చేస్తున్నాను. నా పేరు సి సాంబమూర్తి. డేట్ ఆఫ్ బర్త్ 6-4-1953. చిన్నప్పటి నుండి నాకు ఆర్థిక ఇబ్బందులే. సంతానం కూడా లేదు. చేస్తున్న ఉద్యోగంలో ప్రమోషన్ లాంటివి కూడా లేవు. వెంటవెంటనే రకరకాల జబ్బులు వచ్చి కోలుకోలేనివిధంగా జీవితం తయారయింది. క్రమంగా జ్ఞాపకశక్తి తగ్గిపోతోంది. ఆఫీసులో కూడా ఇతర ఉద్యోగస్తులతో ఇమడలేకపోతున్నాను. దగ్గరి బంధువులు మూర్తి అని...ఆఫీసులో సాంబమూర్తి అని పిలుస్తుంటారు.

**సి. సాంబమూర్తి, మహబూబ్‌నగర్**

మూర్తి అనే పేరులో 'ఆత్మబలిదానం' అనే 33వ నంబర్ ఉన్నది. మననుండి లాభం పొంది మనకు నష్టం కలిగించే నంబర్ అది. దీని ప్రభావం వలన మీ వద్ద డబ్బులు తీసుకున్నవాళ్లు తిరిగి మీకు ఇచ్చే పరిస్థితి ఉండదు. పైగా మీకు ఇతరులు డబ్బు ఇస్తే...విపరీతమైన ఒత్తిడిచేసి తీసుకుంటుంటారు. మీ మొత్తం సి. సాంబశివరావు అనే పేరులో "బ్రాడింగ్ ఓవర్ ది లాసెస్" అనే ప్రభావం చూపే 45వ నంబర్ ఉంది. దాని చెడు ప్రభావం వలనే మీకు అన్నీ అలా జరుగుతున్నాయి. మీ సంతకంలో కూడా ఒవెల్స్1 కాన్సొనెంట్స్ 6 ఉన్నాయి. వీటిని విధ్వంసకరమైన జంట అని అంటారు. ఆ జంట నంబర్ల వలనే మీరు అనారోగ్యంపాలవుతున్నారు. మీకు లాస్ ఆఫ్ మెమొరీ కూడా దాని ప్రభావం వలనే. అందుకనే మీరు ఇక నుండి **SAMBBAMURRTHI** గా మీ పేరును రాసుకోండి. దానికి 37 అనే ప్రభావవంతమైన నంబర్‌ను జతచేయడం జరిగింది. 4,1,5 మీ లక్కీనెంబర్లు. 37ను హై పొటెన్షియన్సీ నెంబర్ అంటారు. దీనివలన ఇంతకుముందు మీకు జరిగిన బ్యాడ్‌నెస్ అంతా కూడా తొలగిపోతుంది. మీరు సంపూర్ణ ఆరోగ్యవంతమైన జీవితాన్ని గడుపుతారు. అదృష్టవంతంగా సాగిపోతుంది.

★★★

నా పేరు చలపతిరావు. 2-3-1966 లో పుట్టాను. నాకు చేతనైనంతలో సాయం చేస్తూనే ఉంటాను. నాకు అంతా కూడా పనిగట్టుకుని అన్యాయం చేస్తున్నారు. తెలిసి నేను ఎవరికీ హాని చేయలేదు. చేసే ఉద్యోగంలో డెవలప్‌మెంట్స్ ఏమీ లేవు. నాతోటి వారంతా ఇలా వచ్చి అలా ఎదుగుతున్నారు. నేను మాత్రం చేరినప్పుడు ఏ స్థాయిలో ఉన్నానో ఇప్పుడు కూడా అదే స్థాయిలో కొనసాగుతున్నాను. ఇంట్లో కూడా అన్నీ సమస్యలే. తగిన సూచనలివ్వగలరు.

**చలపతిరావు,నల్గొండ**

చలపతి అనే పేరులో సంఖ్యాశాస్త్రం ప్రకారం చెడు ప్రభావం చూపించే నంబర్ 31 ఉంది. దీనిని డెత్ నెంబర్ అంటారు. ఆ నంబర్ ప్రభావం వలనే మీ జీవితం ఇలా ఒడిదుడుకులలో సాగుతోంది. అయితే మీరు ఇఐఎఅ ఔఆఅఔఓఔఐగా మీ పేరును మార్పుచేసుకుంటే దాని మొత్తం సంఖ్య 35 వస్తుంది. దాని ప్రభావం వలన ఇకముందు మీ జీవితంలో ముందుకు దూసుకెళతారు. ఇంట్లో సమస్యలు అన్నీ పరిష్కారం అయి ఆనం దంగా జీవిస్తారు. 2,8 మీ అదృష్ట సంఖ్యలు. మీరు చేసే సహాయ కార్యక్రమాలే మిమ్మల్ని నిలబెడతాయి. ఎన్ని కష్టాలొచ్చినా మీరు అనుకున్నది మా త్రం చేయండి.



ఎవరయినా ఏ విధంగా ఆలోచిస్తారో, ఆ విధంగానే ప్రవర్తిస్తారు. -రామకృష్ణ పరమహంస

## జాతకం

వీరికి లలితకళలయందు ఆసక్తి అధికముగానుండును. స్వీయ సంస్కృతియందు అపారమైన ప్రేమ ఉండును. తెలివితేటలు అధికముగా కలిగి యుందురు. ఏకాంత జీవనమునందు ఆసక్తి కలిగియున్న కారణముచే సామాన్యముగా ఇతరులతో కలవరు. ఎదుటివారు వీరిని పలుకరించవలసినదే కాని, ఎదుటివారిని వీరు పలుకరిం పరు. సోమరితనము గూడ వీరియందుండును. కార్య ములను సాధించుట యోగదాయకుడగును. కుజుడు గూడా శుభప్రదుడే. బుధుడు గూడ సామాన్య శుభప్రదుడు. గురు, చంద్రులు దోషప్రదులు. వీరు పురోగమనాభిలాషూలు. మానవ జాతి పురోగమనమును గూర్చిగాని, శాస్త్ర పురోగతిని గూర్చిగాని, సంఘ సంస్కారమునందుగాని, లలిత కళలు ఆధ్యాత్మిక చింతన అను విషయములందుగాని పురోగతికై మిక్కిలి పాడుపడెదరు. నవీనత యందు ఆసక్తి అధికము. మనస్తత్వశాస్త్రము, యోగశాస్త్రము, విద్యుత్ శాఖ మొదలగు లోతైన విషయములందు వీరి మనస్సు ఆసక్తమగును. భౌతిక శాస్త్రములకు, ఆధ్యాత్మిక మార్గములకు సమ

# కుంభరాశి లక్షణాలు

యందు ఉత్సాహమును అధికముగా చూపరు. ఓర్మి అధికముగా నుండును. అదృష్టము కొరకు ఎదురు చూచుట వీరిలో నుండును. పొడవైన బలిష్ఠమైన శరీరము కలిగి గుండ్రని ముఖముతో చక్కని ముఖవర్చస్సు కలిగి యందురు. గర్వము అధికముగా నున్నప్పటికిని ఎదుటివారి కష్టనష్టములను గుర్తించి ప్రవర్తించెదరు. పరోపకారమునందు ఆసక్తి కలిగి యుం దురు. ఉన్నతోద్యోగులతో కలసిమెలసి సంచరించుట వలన పలుకుబడి అధికముగా కలిగి యుందురు. వీరు వ్యసనములకు లోనుకాకుండా జాగ్రత్త పడవలసి యున్నది. స్వభావమును మార్చుకొనుట కష్టము, ధన వ్యయము అధికముగా నుండును.

వీరు కళత్రభావమును చెందిన సుఖము కొరకు అధికముగా పాటుపడుచుండినను కళత్రసంబంధమైన విచారమునకు లోనగుచుందురు. వీరి జీవిత భాగస్వామి గాని, స్నేహసంబంధములుగాని వారి కొరకు వీరు పాటు పడుటయే గాని, వారి ప్రేమ వీరియందు తక్కువగా నుండును. వీరికి అపవాదులు కలుగుటకు అవకాశము న్నది. అకారణమైన అవమానములరకు గురి యగుచుందురు. వీరికి జ్ఞాపకశక్తి అధికముగా నుండును. లక్ష్యము నందు ఏకాగ్రత కలిగియుందురు. కార్యసాధనా పాటవ ము కలిగి యుందురు. పట్టుదల అధికముగా కలిగియుండి ప్రతి విషయమును పూర్వాపర పరిశీలన చేసి కార్యరం గమున ప్రవేశింతురు. సూక్ష్మాన్వేషణయందు నేర్పు అధికము. వీరియందు మంచితనము ఆంతరంగికము గనే యుండునుగాని, పైకి కనిపించనీయరు. మత సంబంధమైన విషయములందు ఆసక్తి దైవభక్తి, వీరి అభిమాన విషయములై యుండును. వీరికి వేదాంత విషయములందు ఆసక్తి అధికముగా నుండును. విచిత్ర విద్య లయందు అభిలాష కలిగి యుందురు. పూవులు, సువా సనా ద్రవ్యములు కలిగి శృంగారభావనలను, అనుభూ తులకు ప్రాముఖ్యము నిత్తురు. వీరికి రక్తప్రసరణయందు లోపములుండును. పంటికి సంబంధించిన అనారోగ్యము లు కలిగి యుందురు. మితి మీరిన శ్రమ పడుట వీరి శరీర తత్త్వమునకు అనుకూల ముగాదు. అంటువ్యాధులను పొందుటకు అనువైన శరీతత్త్వము కలిగి యున్నందున మిక్కిలి జాగ్రత్తగా వ్యవహరింపవలెను. అజీర్ణ సంబంధమైన అనారోగ్యములకు అవకాశమున్నది. కంటికి అనారోగ్యావకాశమున్నది. చర్మవ్యాధులకు గూడా అవకాశము గలదు. వీరికి శుక్రుడు అనుకూల ఫలితముల నిచ్చు చున్వయమును ఏర్పరచుటలో వీరి మనస్సు ప్రవర్తించును. స్వచ్ఛమైన ప్రేమ, మైత్రి అనువానియందు ఆసక్తి అధిక ముగా నుండును. ఋజుప్రవర్తనము త్రికరణశుద్ధి అను నవి వీరికి ముఖ్యములు. వీరి స్వభావము తీవ్రమై ఆల స్యాదులను సహించనిదై యుండును. సామాన్యముగా మృదుస్వభావము, దయ, వినయము, మధురవక్కు కలి గియుందురు. వీరు వాక్చాతుర్యముచే ఎదుటివారిని తమ మనస్సులోని భావములకు అనుగుణముగా మార్చగల రు. తమ విశ్వాసములను మాత్రము మార్చుకొనరు. విఘ్నములు ఎదురైనను ఆదర్శములను సాధింతురు.

వీరు ఉత్సాహముగా కాలమును గడిపెదరు. సన్మానము లు, సంపద ఇష్టమేగాని వానికొరకు ప్రాకులాడరు. శ్రమ కు తగిన సపద గౌరవము లభింపదు. ధన విషయమున ఆలస్యములు, విఘ్నములు ఎదురగుచుండును. వృత్తి సంబంధమైన దూరప్రయాణములు సంభవించును. సోదరులతో కలసి ఏ కార్యము నిర్వహించినను నష్టపోవు దురు. రెండు వృత్తులలో ధనార్జనకు అవకాశము గలదు. ప్రమాదావకాశములుండుటచే జాగ్రత్త అవసరము. చిన్నపనికి గూడ ఎక్కువ ప్రయాణములు చేయవలసి వచ్చును. పితృసౌఖ్యము తక్కువ. జ్యేష్ఠ సంతతిలో కూడా వైరుధ్యముండును. జీవిత భాగస్వామికి లలిత కళల యందు ప్రావీణ్యముండును. దాంపత్యమున గౌరవం, ప్రతిష్ఠ అధికముగను, సౌఖ్యము తక్కువగను ఉండును. సంఘమున ఉన్నతులు, ఉత్తములు అగువారితో చనువు, స్నేహము, మిత్రులు అధికముగా నుండి అవసరమునకు ఆదుకొనుచుందురు. మిత్రుల వననే మేలు కలుగును. బంధువుల వలన మేలు కలుగదు.

మీ సందేహాలని క్లుప్తంగా
(మనిషికి 1 ప్రశ్న మాత్రమే) ఈ క్రింది వివరాలు వ్రాసి పంపండి. (పుట్టిన తేదీ వివరాలు లేనివారు 108 లోగా ఒక సంఖ్య వ్రాసి పంపండి. ఇది ప్రశ్న పద్ధతి, మనిషికి ఒక్క ప్రశ్న మాత్రమే)

పేరు : ....................................
పుట్టిన తేదీ : ..................................
పుట్టిన సమయం : ..............................
పుట్టిన ఊరు (మండలం) : ...................
ప్రశ్న : ...................................

పై వివరాలతో కూడిన లెటర్‌ను ఈ క్రింది అడ్రస్‌కు పంపండి...

'జాతకం' 'సూర్య' ఆదివారం

**SPR publications, Surya Soudha,**
**Plot.No: 185, M.C.H. NO.258/1/185,**
**siddi vinayaka nagar,**
**AyyappaSociety Opp: Hi-Tech City,**
**Hyderabad - 500 072.**

## 22-1-2017 నుండి 28-1-2017 రాశిఫలం



**మేషం: Aries** ( అశ్విని, భరణి, కృత్తిక - 1) పారంభంలో తండ్రి తరపు వారితో చిక్కులు . ధనం నిలువ తగ్గిపోవుట. పెద్దవారి యొక్క కోపానికి గురవుతారు. వృత్తిలో అభివృద్ధి ఉంటుంది. గౌరవం పెరుగుతుంది. కోర్టు వ్యవహారాలు, ఋణాల నుండి విముక్తి లభిస్తుంది. అభివృద్ధికి కొన్ని ముఖ్యమైన నిర్ణయాలు తీసుకుంటారు. మీ కింద పనిచేయువారి నుండి సహాయ సహకారాలు పెరుగుతాయి. వృత్తిరీత్యా ప్రయాణాలు చేయాల్సివస్తుంది. ప్రభుత్వ ఉద్యోగలకు స్థానచలనం కలుగవచ్చు.



**వృషభం: Taurus** (కృత్తిక - 2,3,4, రోహిణి, మృగశిర - 1,2)::వారం ప్రారంభంలో సోదరుల నుండి సహకారం లభిస్తుంది. స్థిరాస్తులకు సంబంధించిన వ్యవహారాల్లో చికాకులు తొలగుతాయి. శత్రువుల చేతిలో మోసపోతారు. స్త్రీల వలన అవమానాలు కలుగుతాయి. మీరు రహస్యంగా దాచాలనుకున్న విష యాలు అందరికీ తెలియడం వలన అవమానాలు పొందుతారు. పిల్లల యొక్క అభివృద్ధి ఆశించిన రీతలో ఉండదు. సంతానం వలన చికాకులు వస్తాయి. నూతన వ్యాపార ప్రయత్నాలు వాయిదా పడతాయి.



**మిధునం: Gemini** (మృగశిర -3,4 ,3,4, ఆరుద్ర, పునర్వసు-1,2,3) ఈవారం ప్రారంభంలో భార్యవర్గం వారి నుండి అనుకూలత. వృత్తిరీత్యా ప్రయాణాలు చేయదురు. కుటుంబ సభ్యు లతో విరోధము. ఆదాయం కన్నా ఖర్చులు ఎక్కువ అగును. ఋణదాతల నుండి ఒత్తిడి వస్తుంది. వాహన ప్రమాదాలు జరుగుట, సొంత పనులు వాయిదాపడతాయి. విద్యావంతులతో స్నేహం ఏర్పడుతుంది. పోటీ పరీక్షల్లో విజయం లభిస్తుంది. స్త్రీలతో విరోధం వస్తుంది. భార్యతో ఎడబాటు కలుగుతుంది.



**కర్కాటకం: Cancer**(పునర్వసు -4, ఈ రాశివారుఈవారం అన్నదమ్ముల సహాయ సహకారాలు లభిస్తాయి. శుభవార్తలు వింటారు. రక్తపోటు అజీర్ణము వంటి వ్యాధులు కలిగే అవకాశం ఉంది. ఋణాల నుండి విముక్తి లభిస్తుంది. భార్యాభర్తల మధ్య విరోధాలు వస్తాయి. పిల్లల యొక్క అభివృద్ధి విషయంలో అసంతృప్తి కలుగుతుంది. పుణ్యక్షేత్రాము సందర్శించే ప్రయత్నం చేస్తారు. వ్యసనాలపై ఆసక్తి కలుగుతుంది. అనవసర ఖర్చులు ఎక్కువగా ఉంటాయి. వృత్తిరీత్యా అధికారులతో విభేదాలు వస్తాయి.



**సింహం: Leo** (ముఖ, పుబ్బ, ఉత్తర -1): :సంతానంతో విరోధం. స్థిరాస్తులపై ఆదాయం తగ్గుతుంది. స్థిరాస్తుల విషయంలో బంధువులతో విరోధాలు వస్తాయి. తల్లిగారికి అనారోగ్యం కలుగుతుంది. స్పెక్యులేషన్ వలన కలసివస్తుంది. ఉద్యోగస్తులకు అధికారుల వలన ఇబ్బందులు వస్తాయి. వ్యాపారస్థులకు ఆదాయం తగ్గుతుంది. విదేశాలలో ఉన్న మిత్రుల సహకారం లభిస్తుంది. ఋణప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యార్థులు మంచి ఫలితాలు సాధిస్తారు.



**కన్య: Virgo** ( ఉత్తర - 2,3,4, హస్త, చిత్త -1,2)::మాతృ వర్గం వారితో విభేదాలు వస్తాయి. సేవకుల వలన పెంపుడు జంతువుల వలన నష్టం కలుగుతుంది. గృహనిర్మాణాలు వంటి పనులు వాయిదాపడతాయి. సంతానానికి కష్టాలు, అనారోగ్యం కలుగుతుంది. వృత్తిలో అసంతృప్తి, స్వజనులతో వ్యతిరేకత, సొంత ఊరు విడిచి జీవనోపాధి కొరకు ఇతర ప్రాంతాలకు వెళ్తారు. వృత్తిలో చికాకులు వస్తాయి. అదనపు ఆదాయం కొరకు చేసే ప్రయత్నాలు వాయిదాపడతాయి. డబ్బులకు ఇబ్బందులు వస్తాయి.



**తుల: Libra** (చిత్త -3,4, స్వాతి, విశాఖ -1,2,3 అన్నదమ్ముల నుండి అనుకూలత, సహకారం లభిస్తుంది. ధైర్య సాహసాలు పెరుగుతాయి. పోటీల్లో విజయం లభిస్తుంది. మాతృవర్గంతో విభేదాలు వస్తాయి. కళారంగంలో ఉన్నవారికి వృత్తిలో గుర్తింపు వస్తుంది. నూతన అవకాశాలు లభిస్తాయి. వృత్తిరీత్యా ప్రయాణాలు చేస్తారు. ఆరోగ్యంలో అభివృద్ధి ఉంటుంది.



**వృశ్చికం: Scorpio** (విశాఖ -4 అనూరాధ, జ్యేష్ఠ) అనూరాధ, జ్యేష్ఠ)ఈవారం ధనలాభం కలుగుతుంది. రహస్య సంపాదన లభిస్తుంది. అదనపు ఆదాయం కొరకు చేయు ప్రయత్నాలు ఫలిస్తాయి. మీది కాని ధనం లభిస్తుంది. వృత్తిరీత్యా అధికారుల నుండి వేధింపులకు గురవుతారు. అయినప్పటికీ తోటి ఉద్యోగుల సహకారంతో సమస్యలు పరిష్కరించుకుంటారు. నిరుద్యోగులకు ఉపాధి అవకాశాలు లభిస్తాయి. విద్యార్థులు శ్రమకు తగిన గుర్తింపు పొందుతారు. చెడు వార్తలు వినవలసి వస్తుంది.



**ధనుస్సు: Sagittarius** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ -1): వృత్తిలో అభివృద్ధి, గుర్తింపు లభిస్తాయి. అజీర్ణం లేదా నరాలకు సంబంధించిన వ్యాధులు కలుగవచ్చు. వృత్తిరీత్యా స్వార్థపరులైన వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నం చేస్తారు. మీ యొక్క వాక్చాతుర్యంతో సమస్యల నుండి తప్పించుకుంటారు. వృత్తిలో మార్పు కొరకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. అదనపు సంపాదన పెరుగుతుంది. ఆధ్యాత్మిక ప్రసంగాలలో పాల్గొంటారు.



**మకరం: Capricorn** (ఉత్తరాషాఢ -2,3,4, శ్రవణం, ధనిష్ఠ -1,2): అనసవర ఖర్చులు ఎక్కువగా ఉంటాయి. వృత్తిలో అభివృద్ధి కొరకు చెడ్డ వ్యక్తులను ఆశ్రయిస్తారు. అధికారుల ఆగ్రహానికి గురవుతారు. మోకాళ్ళ నొప్పులు, వెన్నుపూసకు సంబంధించిన వ్యాధులు కలుగవచ్చు. తండ్రి లేదా అన్నదమ్ములకు ఆర్థికపరమైన సమస్యలు వస్తాయి. మీ సంతానంలో ఒకరికి మంచి ఉద్యోగం లభిస్తుంది. స్త్రీలకు వృత్తిలో అభివృద్ధి లభిస్తుంది. ఎలక్ట్రానిక్ పరికరాలు కొనుగోలు చేస్తారు.



**కుంభం: Aquarius** (ధనిష్ఠ-3,4, శతభిష, పూర్వాభాద్ర- 1,2,3 శతభిష, పూర్వాభాద్ర-1,2,3ఆర్థిక లాభం కలుగుతుంది. విదేశాలలో ఉన్న బంధు మిత్రుల నుండి లాభం కలుగుతుంది. మీ పిల్లలు ఆర్థికంగా మీకు సహకరిస్తారు. మీ పరిశోధనలకు తగిన గుర్తింపు లభిస్తుంది. ఋణాలు వసూలు అవుతాయి. వృత్తిలో అదనపు ఆదాయం లభిస్తుంది. ఉద్యోగస్తులకు స్థానచలనం కలుగవచ్చును. మీ కుటుంబంలో ఒకరికి విదేశ అవకాశం వస్తుంది. మంచి పనులకు ధనం సహాయం చేస్తారు. వృత్తిరీత్యా ప్రయాణాలు చేస్తారు.



**మీనం: Pisces** (పూర్వాభాద్ర -4, ప్రయత్న కార్యాలు ఫలిస్తాయి. వృత్తి వ్యాపారాలలో లాభం కలుగుతుంది. పుత్రులు విదేశాలు వెళ్లుటకు అవకాశం వస్తుంది. కళత్ర సౌఖ్యము తగ్గుతుంది. భార్యకు అనారోగ్యం కలుగుతుంది. బంగారు ఆభరణాలు అమ్మాల్సివస్తుంది. వ్యాపార భాగస్తులతో విరోధం వస్తుంది. చెడు వార్తలు వినాల్సివస్తుంది. తల్లిగారికి అనారోగ్యం కలుగుతుంది. ఉద్యోగస్థులకు స్థానచలనం కలుగుతుంది. సంతానంతో విరోధం కలుగుతుంది.



ధీరుడు ఒకేసారి మరణిస్తాడు. పిరికివాడు క్షణక్షణం మరణిస్తాడు. కాబట్టి ఎప్పటికీ ధీరుడివలె వుండడానికి ప్రయత్నించాలి. -స్వామి వివేకానంద

ఆలయం



> మూడు దేవాలయాల సమాగయంగా ఉన్న రాక్‌ఫోర్ట్ తమిళనాడులో తిరుచ్చి (తిరుచిరాపల్లి)లో ఉన్నది. పర్వత పాదాల వద్ద మనిక వినాయకర్ దేవాలయం ఉండగా...

# రాక్‌ఫోర్ట్ టెంపుల్

పేరుకు తగ్గట్టు రాక్‌ఫోర్ట్ టెంపుల్... పర్వతంపై 83 మీటర్ల ఎత్తున శిలలో అత్యద్భుతంగా మలచబడింది. ఈ కొండపై మొత్తం మూడు దేవాలయాలు ఉన్నాయి. ఈ దేవాలయ సముదాయాల నిర్మాణం పల్లవుల హయాంలో ప్రారంభమైనప్పటికీ... ఆ తరువాత విజయనగర రాజుల ఆధ్వర్యంలో మధురై నాయకులు వీటి నిర్మాణాన్ని పూర్తిచేశారు. వీరికాలంలో దేవాలయం ఎంతగా నో అభివృాఎద్ధి చెందింది. ఏకశిలను తొలిచి నిర్మిం చిన రాక్‌ఫోర్ట్ పర్వత శిఖరానికి... ఎంతో కఠినతరమైన 437 ఎగుడు మెట్లు ఎక్కితే గాని చేరుకోలేం.

మూడు దేవా లయాల సమాగయంగా ఉన్న రాక్‌ఫోర్ట్ తమిళనాడులో తిరుచ్చి (తిరుచిరాపల్లి)లో ఉన్నది. పర్వత పాదాల వద్ద మనిక వినాయకర్ దేవాలయం ఉండగా... పర్వత శిఖరం వద్ద ఉచ్చి పిల్లయార్ కోయిల్ దేవస్థా నం ఉంది. ఇక్కడ... ప్రసిద్ధిగాంచిన శివాలయం తాయుమనస్వామి దేవాలయం ఉన్నది. శిలను చెక్కి అపురూ˘ఎంగా మలిచిన ఈ శివస్థలం పర్యాటకులను కనురెప్పవేయనీయదు. ఇక్కడ ఉన్న దేవాలయ సముదాయంలో... లలితాంకుర పల్లవేశ్వరం అనే పల్లవులు నిర్మించిన దేవాలయం కూడా ఎంతో ప్రఖ్యాతిపొందినది. ఇక్కడ ఎన్నో అరుదైన శాశనాలు పల్లవ రాజు మంహేంద్ర పల్లవన్ గురించి అనేక విశేషాలను తెలియజేస్తాయి. చోళలు, విజయనగర రాజులు, మధురై నాయకులు ఈ దేవాలయాన్ని విశేషంగా అభివృాఎద్ధి చేశారు. అంతేకాకుండా, కొండపై ఉన్న రెండంతస్థుల తాయుమనస్వామి దేవాయలం ఇక్కడి నిర్మాణాల్లోనే తురుపుముక్కగా అనడంలో ఎలాంటి సందేహం లేదు. అద్భుత కళానైపుణ్యం ఈ దేవాలయం సొంతం. ప్రతిరోజు ఇక్కడ ఆరు రకాల పూజలు జరుగుతాయి. చితిరైలో ప్రతియేటా ఒకసారి బ్రహ్మోత్సవం కూడా జరుగుతుది. ఆదిపూరం, ఫ్లోట్ ఫెస్టివ ల్ జరిగే పంగుని ప్రదేశం కూడా ఇక్కడ ఎంతో ప్రఖ్యాతి పొందిన ప్రదేశం. మధురై నాయకులు నిర్మించిన ఈ రెండు దేవాలయాల్లో ఒకటి శివాలయం కాగా, మరొకటి గణేష్ దేవస్థానం. అద్భుత శిల్పకళారీతులకు ఆలవాలంగా ఉన్న... 7వ శతాబ్దానికి చెందిన దేవాలయాలు ఇవి. ప్రఖ్యాతిగాంచిన ఎన్నో శిల్పరీతులకు పెట్టింది పేరు. పర్వత పాదాల వద్ద ఉన్న వినాయకుడి దేవస్థానం, అలాగే పర్వత శిఖరం వద్ద ఉన్న అతిపెద్ద శ్రీ తాయుమాన స్వామి దేవాలయాల్లోకి హిందూయేతరులను అనుమతించరు. పర్యాటకుల సందర్శనార్థం ప్రతిరోజూ ఉదయం 6 గంటల నుండి రాత్రి 8 గంటల వరకు ఈ ఆలయాలను తెరిచి ఉంచుతారు.

**వినాయక దేవస్థానం...** లంకాధీశుడైన రావణుడి అనుంగు సోదరుడైన విభీషణడు... అపహరణకు గురైన సీతాదేవిని రక్షించేందుకు రాముడి పక్షాన చేరి తన సహాయ సహకారాలను అందిస్తాడు. తరువాత యుద్ధంలో రావణుడి ఓడించిన రాముడు తన ధర్మపత్ని సీతను కాపాడుకు ంటాడు. ఈ నేపథ్యంలో తనకు సహాయాన్ని అందించిన విభీషణుడికి ఏదైనా బహుమతి ఇవ్వాలనే ఉద్దేశంతో రాముడు... విష్ణుమూర్తి అవతారమైన రంగనా థస్వామి విగ్రహాన్ని ఇస్తాడు. అయితే ఇది గమనించిన దేవతలు... ఒక అసురుడు విష్ణుమూర్తి అవతారమైన రంగనాథస్వామి విగ్రహాన్ని తన రాజ్యానికి తీసు కెళ్ళడాన్ని సహించలేక పోతారు. దాంతో, దేవతలు ఎలాగైనా విభీషణుడు ఆ విగ్ర హాన్ని తీసుకెళ్ళకుండా ఆపాలని నిశ్చయించుకొని విఘ్న నాయకుడైన వినాయకుడి సహాయం కోరుతారు. అప్పుడు వినాయకుడు వారి కోరికను మన్నిస్తాడు. రాముడు ప్రసా దించిన విగ్రహాన్ని తీసుకొని లంకకు బయలుదేరిన విభీష ణుడు కావేరీ నది మీదుగా వెళ్తూ... ఆ నదిలో స్నానం చేయాలని భావిస్తాడు. ఆ సమయంలో ఆ విగ్రహాన్ని ఎవరికైనా ఇవ్వాలనుకుంటాడు. ఎందుకంటే, ఒకసారి ఆ విగ్రహాన్ని నేలపైన పెడితే మళ్లీ తీయడం అసంభవం. దాంతో ఏం చేయాలి? అని మదనపడుతున్న సమయంలో అక్కడే పశువులను కాస్తున్న బాలుడిలా మారువేషంలో ఉన్న వినాయకుడి చేతికి ఆ విగ్రహాన్ని అందించి... విభీషణుడు స్నానానికి ఉపక్రమిస్తాడు. విభీషణుడు నదిలో మునగగానే మారువేషంలో ఉన్న వినాయకుడు ఆ విగ్రహాన్ని కావేరీ నది తీరంలో ఉన్న ఇసుకపై పెడతాడు (ఆ విగ్రహం పెట్టిన చోటే... నేడు ప్రపంచంలోనే అతిపెద్ద దేవాలయంగా విరాజిల్లుతున్న రంగనాథస్వామి దేవాలయం). ఇది గమనిం చిన విభీషణుడు పశులకాపరిని తరుముతూ వెంబడిస్తాడు. దీంతో ఆ బాలుడు పక్కనే ఉన్న కొండపైకి చకచకా ఎక్కేస్తాడు. విభీషణుడు కూడా ఆ కొండపైకి ఎక్కి ఆ బాలుడి నుదిటిపై ముష్టిఘాతం కురిపిస్తాడు. అప్పుడు మారువేష ంలో ఉన్న ఆ బాలుడు వినాయకుడిగా మారిపోతాడు. అప్పుడు తన తప్పును తెలుసుకొని వినాయకుడిని క్షమాపణ వేడు కుంటాడు విభీషణుడు. ప్రసన్నుడైన విఘ్నరాజు విభీషణుడి దీవించి లంకకు పంపిస్తాడు. వినాయకుడు ఎక్కిన ఆ కొండనే ఈ రాక్‌ఫోర్ట్ టెంపుల్. అక్కడ వెలిసిన వినాయకుడి దేవస్థానమే ఉచ్చి పిల్లయార్ దేవాలయం.

**తాయుమనస్వామి...** వినాయుడి దేవస్థానానికి ఉన్నట్టే, ఈ గుడికి కూడా పురాతన గాథ ప్రచారంలో ఉంది. ఒకనాడు శివభక్తురాలైన రత్నవతి అనే ఆవిడ పురిటినొప్పులతో బాధపడుతూ తన తల్లి రాకకోసం ఎదురుచూస్తుంది. ఎంతసేపటికీ తన తల్లి రాకపోవడంతో... నన్ను ఎలాగైనా రక్షించు స్వామీ అని శివుడిని వేడుకుంటుంది. అప్పుడు శివుడే స్వయంగా రత్నవతి తల్లి రూపంలో వచ్చి పురుడు పోస్తాడు. అప్పటినుండి ఆయనకు తాయుమనస్వామి అనే పేరు స్థిరపడిపోయింది (తాయుం - అన - స్వామి అంటే... తల్లి రూపంలో వచ్చిన భగవంతుడు అని అర్థం). అప్పటినుండి ఈ దేవాలయానికి తాయుమనస్వామి దేవాలయం అనే పేరు సార్థకమైంది. పర్వతపాద ప్రాంతం నుండి సుమారు రెండు వందల అడుగుల ఎత్తులో ఉన్న ఈ దేవాలయం ఎంతో అందంగా, ఆకర్షణీయంగా ఉంటుంది. దేవాయం పైకప్పుపై ఉన్న పెయింటింగ్స్ సందర్శకులను మైమరపిస్తాయి. ఈ ఆలయ నిర్మాణం ఆనాటి పల్లవుల శిల్పకళా నైపుణ్యానికి అద్దం పడతాయి. ఇక్కడ శివపార్వతులతో పాటు మహాలక్ష్మి విగ్రహం కూడా ఉండడం విశేషం.

ఆధ్యాత్మిక భారతం



**భారతీయ సనాతన ధర్మంలో నాగపంచమి విశేషమైనదిగా చెప్పబడింది. శ్రావణ మాసంలో శుక్ల పంచమి నాగపంచమిగా చెప్పబడింది. ఈ మాసంలో ఈ తిథి 20 వ తేదీన వచ్చింది. మన హిందూ ధర్మంలో ఈ రోజుకు ఎందుకు అంత ప్రాధాన్యతను ఇచ్చారు. ఈ నాగపంచమి వెనుక వున్న భారతీయుల యోగ వైభవం ఏంటి అనేదానిపై మన దృష్టిని మరల్చితే విశేషమైన ప్రయోజనం వుంటుంది.**

# పాముల్లో హిందూ ధర్మ రహస్యాలు

భారతదేశం యోగ భూమి,ఇక్కడ పుట్టిన వారికి జీవాత్మను పరమాత్మతో ఐక్యమొందించే యోగాన్ని పొందటమే లక్ష్యంగా ఒకప్పుడు వుండేది. భవిష్యత్తు తరాలలో దాని ప్రాముఖ్యతను మానవాళి గుర్తించడమే మరిచిపోతారని ఋషులు గుర్తించే మనకు నాగపంచమి ప్రాముఖ్యతను కథలు కథలుగా చెబుతూ వచ్చారు. అయితే నాగ పంచమికి యోగానికి సంబంధమేమిటి అనే సందేహం కలుగ వచ్చు, కానీ రహస్యమంతా అక్కడే దాగి వుంది. హిందూ సాంప్రాదాయంలో ఏ దేవాలయానిక వెళ్లినా మనకు పాముల విగ్రహాలు, చిత్రపటాలు లేదంటే చెక్కిన శిల్పాలు గోచరిస్తాయి. ప్రాచీనమైన దేవాలయాలలో నాగులను కూడా దేవతలుగా కొలుస్తుండటం వెనుక ఎన్నో యోగ రహస్యాలు దాగి వున్నాయి.

మానవుడి కుండలినీ శక్తి మూలాధారం నుండి సహస్రారానికి చేరటంలో ఇడా,పింగళ,సుషుమ్న నాడుల పాత్ర అనిర్వచనీయం. ఈ నాడుల ద్వారా జరిగే పక్రియతోనే మూలాధారంలో నిద్రాణంగా వున్నటువంటి శక్తి బుసలు కొడుతూ సహస్రారానికి చేరుతుంది. దాన్ని ఓ సర్పంగా అభివర్ణించారు యోగులు. ఈ శక్తి మానవ శరీరంలో వెన్నుపాములో దాగి ఉంటుంది. మూలాధారంలో దాగివున్న ఈ కుండలినీ శక్తిని సుషుమ్న నాడి ద్వారా పైకి సహస్రారం వరకు తీసుకొనివెళ్లే క్రమంలో ఆ శక్తిని చుట్టుకుని వెళ్లే రెండు

పాములాంటి ఆకారాలే ఇడా పింగళనాడులు... ఇవి పామును పోలినవిగా వుంటాయి. ఈ నాడులే మన జీవన మనుగడకు ఎంతో ఆధారభూతమైనవి. అందుకే మన సనాతన ధర్మంలోనే కాదు నేడు ఆధునిక వైద్య శాస్త్రం యొక్క గుర్తుని కూడా ఇడా పింగళ నాడులు వెన్నును చుట్టి వున్నట్టుగా పాముల ఆకారంలో చిత్రీకరించుకుని వాడుతున్నారు.. కుండలినీ యోగలో కుండలినిని జాగృతం చేయడానికి యోగ సాధన ముఖ్యమైన మార్గము. కుండలినీ శక్తి సహస్రారం చేరినప్పుడు యోగసాధకుడు ఒక అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవిస్తాడు.

ఈ విధమైన యోగ రహస్యాలను సాధారణమైన మానవులకు కూడా అర్థమయ్యే రీతిలో ఎక్కువ మందికి ఈ రహస్యాన్ని చేరవేసే ప్రయత్నంలో ఋషులు విశేషమైన ప్రయత్నం చేసారు. నాగ పంచమి లాంటి విశేషమైన పర్వదినాల ద్వారా మనలను యోగమార్గంలోకి తీసుకువచ్చే ప్రయత్నం చేస్తున్నారు. అంతే కాదు దక్షిణాయనంలో సాధకులు మొదలుపెట్టే సాధానా మార్గాలను ఈ నాగపంచమినుండి ప్రారంభిస్తే విశేషమైన ఫలితాలను పొందవచ్చు. భారతీయ సనాతన ధర్మంలో ప్రతి జీవానికి ఎంతో విలువను ఇచ్చారు. వాటితో చెలిమి చేయమనే చెప్పారు. పామును కూడా ఏదో విష జీవిగా చూసే ఆలోచనను మానుకోవాలి. నాగుల చవితి నాడు పుట్టలో పాలు పోసి మిగిలిన రోజుల్లో కర్రలతో చంపడం ఎంతవరకు సమంజసం. ఇంకో ముఖ్యమైన విషయం ఏంటంటే పాములు ఎక్కువగా సంచరించే ప్రదేశాలు అంటే అక్కడ పూర్వం ఎవరో మునులు తపస్సు చేసిన ప్రదేశాలుగా అర్థంచేసుకోవాలి. అలాంటి ప్రదేశాల్లో పాములు ఎక్కువగా సంచరిస్తాయి. ఆ ప్రదేశాల్లో మనం నివాసాలు ఏర్పరచుకు న్నాము, కానీ మన పరిసరాల్లోకి అవి వచ్చాయని వాటిని చంపు తున్నాము. మన సాంప్రదా యాల్లో ఆధ్యాత్మిక కోణమై కాదు సామాజిక బాధ్యత కూడా వుంటుంది. ఈ పర్వదినాలను పురస్కరించుకుని యోగులు గానే కాదు మంచి పౌరులుగా కూడా మనం తీర్చిదిద్దబడాలి.

మాటలతో కూడిన హృదయం లేని ప్రార్థన కంటే, మాటలు లేకుండా హృదయంతో చేసే ప్రార్థనే గొప్పది -గాంధీజీ

# వావ్!





## కిస్సా...కుర్సీ హై !!!

కాదేదీ కూర్చోవడానికి అనర్హం...కూర్చోవడానికి ఎక్కడైతేనేం...అనుకోకండి. కొంతమందికి కూర్చునే ఫోబియా ఉంటుంది. ఎక్కడ కూర్చుంటే కుర్చీ లాగేస్తారో అని మరి కొందరు రాజకీయ నాయకులు భయపడుతుంటారు. కొందరు ఆఫీసులో పనిచేసేవాళ్లకు ఈ మధ్య కూర్చుని...కూర్చుని వెన్నుకు సంబంధించిన వ్యాధులకు గురవుతున్నారని ఓ సర్వే..అలాగని కూర్చోకుండా పనిచేయలేము కదా...ఇక్కడ ఇచ్చిన కొన్ని కుర్చీలలో మీకు నచ్చినవి...మీరు మెచ్చినవి సెలక్ట్ చేసుకుని ఆఫీసులో...ఇంట్లో వాడుకోవడానికి ప్రయత్నించండి. ఎప్పుడూ ఒకే తీరుగా కూర్చుంటే బోరే కదా...మసాజ్ చేసే కుర్చీలు కూడా వస్తున్నాయి. సేదతీరే కుర్చీలు...కూర్చుని లేక పడుకుని ఇంటర్ నెట్ కూడా చూసుకునే కుర్చీలు కూడా వస్తున్నాయి. మచ్చుకు కొన్ని కుర్చీలు ఇక్కడ మీరు ఎప్పుడు ఆసీనులవుతారా...అని ఎదురు చూస్తున్నాయి...వెల్‌కం...ఆలస్యమెందుకు...















# www.mohanpublications.com

# మోహన్ పబ్లికేషన్స్‌లో లభించు

# పుస్తకముల పట్టిక

## (Book List)

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆయుర్వేద, మంత్రశాస్త్రాది
అనేక విషయాలు తెలుసుకోండి...

ఫేస్‌బుక్ **మోహన్ పబ్లికేషన్స్** పేజ్ లైక్ చేయండి.

Like us to follow :



**MOHAN PUBLICATIONS**
Rajamahendravaram



0883 - 246 2565
903 246 2565

Mohan PUBLICATIONS

మోహన్ పబ్లికేషన్స్,

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533101.

WWW.MOHANPUBLICATIONS.COM

# మావద్ద లభించు గ్రంథములు

## 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

